హా నిపుణోక్తులం జెనక నాబిడఁ జూ చిటురమ్మటన్నచోఁ
బూనిక నిట్లు! చేకొనెదు బుద్ధిటువచ్చితి నేమి చెప్పరా. 157

తే. మంచి తగినగృహస్థుఁడ వెంచఁబరక, కెత్తుకొమ్మన్నఁ బాతికె కెత్తుకొంటి
వనినఁ జతురుండు వణఁకంగ నప్పళించి, జడియకు మటంచుఁ గౌఁగిటఁజక్కఁ జేర్చి.

* * * * *

వ. ఇట్లు చెలంగి. 160

* * * * *

* * * * *

* * * * *

తే. ఏగి సంధ్యాద్యనుష్ఠాన మెలమిఁదీర్చి, పురములో రచ్చతావులఁ బ్రొద్దుపుచ్చి
యస్తమయము సమీపమౌ నంత నేటి, కేగి మజ్జనమాడి యచ్ఛతోడ. 164

క. అక్షసరం బార్ద్రాంశుక, మక్షయ కరపాత్ర మమర నతఁ డప్పురిలో
భిక్షాందేహి యటంచు న, పేక్షం బ్రతిగృహముఁ దిరిగి భిక్షం బెత్తున్. 165

తే. ఎత్తితెచ్చిన భిక్షాన్న మెల్లఁజల్ల, శాకమిడునింట భుజియించి సకలవైశ్య
జాల యాచితలబ్ధతాంబూలచర్వ, ణోష్ఠశోణిమ మోమున నొఱపుసెఱప. 166

క. మనుజులు నిద్రాశయులై, యొనరినతఱి నాల్గుదిక్కులాగిఁ జూచుచు వే
చని భాషిణియింటికి ముద, మునఁ జతురుఁడు నిచ్చదాని ముచ్చటఁ దీర్చున్. 167

వ. ఇట్లు ప్రతిదినంబున నతండు భాషిణీయోషాభిప్రాయంబు దీర్చునంత. 168

మ. ఉహుహూకారితనూవిధూనన జనద్వ్యాహారోపభూజృంభమా
ణహసంతీజ్వలనంబు శీతపవమానస్పర్శరోమోద్గమా

పహసాంగాఖిలజంతు సంఘము హిమవ్రాతంబుజాతాండమై
మ్మహిమీఁదం బొడసూపె నెయ్యెడల హేమంతంబు దుర్దాంతమై. 169

సీ. సకలదివ్యాస్త్రబకసితీకృతములు బహుళనిద్రాముద్రపంకజములు
నిబిడవర్షితమహానీహారకణములు శీతలోత్తరజాతవాతతతులు
వర్ధితనిర్ధూమవహ్నిహాసంతులు గైరవవికసన కారణములుఁ
దాలవృంతనివారకేళిదారణములు యామినీ సముదయామోదములు

తే. సరసమృగమద మేచకాగురుసుగంధ, బంధురశ్రీకుచద్వంద్వబాధయుక్తి
చకితపురుషావళీ శీతసాధ్వసములు, భాసురము లయ్యె హేమంతవాసరములు 170

ఉ. శాంతములయ్యె నెండలు నిశాంతములయ్యె వధూకుచంబుల
త్యంతము వాడి వేఁడిమికిఁ దాంతములయ్యెఁ బయోజము ల్వ్రిణా
క్రాంతములయ్యె వాతెఱలు కాంతములయ్యె మహోష్ణవస్తులా
శాంతములయ్యెఁ దావులు నిశాంతములన్ హిమ వారివారికిన్. 171

* * * * *

చ. సెలవునఁ జందరశ్మి గనిష్ఠకుటుంబిని లేనిపోనివా
దులజగడించు చిల్వెడలఁ దోలిన వ్రాలిన చింతనొంది యీ
ర్ప్ర తెనయి దైవమా యనుచుఁ బొక్కుచు నెవ్వరు బల్కరించుఁ దే
రెలుఁగున భాషిణీయుంవలి యంటికి వచ్చె నతండు ఖిన్నుఁడై. 173

తే. వచ్చి యచ్చందరశ్మి తావాకిటకడ, నిలిచి తనయగ్రమహిషినిఁ బిలువఁగానె
గుండె ఝల్లని చతురుండు కొంకుచుండ, నతని నెట్లింతి యిలు వెళ్ల ననుపవలయు.

క. ఇది తెలిసిన నృపునెనయం, బది మని రాయంచ పలుక భామామణి నా
కది తెలియ దెటుల ననిపెను, విదితముగాఁ దెలుపు మనిన విహగం బనియెన్.175

తే. అటుల నిజపతి తనుఁబిల్వ విటునికేలు, పట్టితోడ్తెచ్చి భాషిణీ పద్మగంధి
తలుపుఁ దెఱచుచు నామూల నిలిపి వాని, నాత్మనాథుని కెదురుగా నరిగియపుడు

ఉ. నెయ్యము మీఱఁగాఁ జరణనీరజము ల్తలసోఁక మ్రొక్కి వే
డ్కయ్యెడఁ బల్లవింప హృదయంబున భాషిణి యాత్మ నాయకున్
శయ్యకుఁ దార్చి దివ్వె తెరుచక్కివెలుంగ ముసుంగుపెట్టి నేఁ
డెయ్యెడకైన నేగవె చెలీ యని పల్కి పరుండెఁ దిన్నగన్. 177

చ. అనువచనంబు దన్ను నొకయన్యగృహంబున కేగు మంచుఁ బ
ల్కినదని యాత్మ నెంచి పడిగేహము వెల్వడి యావిటుండు పో

యినతరువాత భాషిణి నిజేశునిదగ్గఱఁ బండసైఁపకం
గొనకొనలేనివాఁడు లొనఁగూర్చి చరించెను వేఁగునంతకున్. 178

క. జారులపై నాసక్తులు, నారుల కున్నటుల నాత్మనాయకులపయిం
గోరిక లున్నవె యని ఖగ, మారయ వచియించుతఱి నిశాంతం బైనన్. 179

మ. కని హేమావతి దానిమెచ్చుచు సమగ్రస్వర్ణసౌధాంతరం
బున నత్తీపనిజాళువాగొలుసులన్ బొల్పొందు నుయ్యాలపై
ఘనతం జేరి వసుంధరాధిపతి యోగప్రాప్తిఘుప్రాంతమా
దనుకం గుంది తమిస్రమాట కెదమోదం బంది యూహిమ్మటన్. 180

సీ. సకటాక్షదీప్తికాంచనరత్నతాటంక ధగధగల్చెఁకట్లు దలఁగఁద్రోయ
సకపోలకాంతి మౌక్తిక హారవల్లికా చకచకల్సాంద్రచంద్రికలుగాయ
నవలయధ్వని హేమసప్తకీకింకిణీ ఘణఘణల్ శ్రుతి కౌతుకముగ మ్రోయ
సస్థానకసుగంధసారసదళదామ ఘుమఘుమ ఘ్రాణోత్సవముగఁజేయఁ

తే. గళుకుపనిచిల్కవగలేఁత తళుకు లొలుకు, జాళువాకమ్మి సరిగంచు చలువవలువ
ధళధళ ల్రాజిపువ్వు మొత్తములు గురియ, నంచకడఁ జేరె సొంతానిమించుబోఁడి.

క. చేరిన హేమావతి ముఖ, మారసి నెఱజాణ వౌదు వనుదినము మెయి
న్వేఱొక వగ గుల్కఁగ శృం, గారింపఁగ ననుచు ముదము గల్పించి యనెన్.

---

## పండ్రెండవరాత్రికథ.

చ. మనవి పరాకుమాని విను మానిని పూనికమై కళింగభూ
మిని సిరి కాస్పదంబు జనమేజయుఁ డేలు సుగంధబంధురం
బనుపుర ముల్లసిల్లుమణిహర్మ్యవినూతనకేతనచ్ఛటా
జనితసువాతధూతసురసాలపతత్సుమధౌతవీథియై. 183

శా. అం దుండున్ భసితత్రిపుండ్రమను గామాత్ముల్జడ ల్కాషపా
లం దేక్ దండము కావివస్త్రములు రుద్రాక్షల్ దువాళించు కా
లం దెల్పాదుకలు న్మృగాజినము బెత్తం బొప్ప సంసారియో
గీంద్రుం డొక్కఁడు శూద్రుఁ డీశపదభక్త్యైకాగ్రచిత్తాబ్జుఁడై. 184

వ. అతండు పృథివ్యప్తేజోవాయ్వాకాశంబు లను పంచభూతంబులును, త్వక్చక్షుఃశ్రో
త్రజిహ్వాఘ్రాణంబు లనుజ్ఞానేన్ద్రియంబులును, వాక్పాణిపాదపాయూపస్థలను
కర్మేంద్రియంబులును, శబ్దస్పర్శరూపరస గంధంబులనువిషయేంద్రియంబులును
మనోబుద్ధిచిత్తాహంకారంబులను నంతఃకరణచతుష్టయంబును, జీవునితోఁ గూడి
పంచవింశతితత్త్వంబులగు ననియెఱింగి యమ నియ మాసనప్రాణాయామ ప్రత్యా

హార ధ్యాన ధారణ సమాధు లనం బరగు నష్టాంగయోగంబులఁ జతురుండై కమల
యోగబ్రహ్మగారుడ సుఖ వీరకూర్మ సిద్ధానంత కుక్కుటాసనంబులనిశ్చలతనిలిచి
రేచక పూరక కుంభకంబులను, బ్రాణాపాన వ్యానోదానసమానంబు లనుప్రధా
నవాయువులను, నాగ కూర్మ కృకర దేవదత్తధనంజయంబు లనునుపవాయువులను
స్వాధీనత నొందించి యిడాపింగళసుషుమ్నా మార్గంబులను, నున్మనిమనోన్మనులను
నాదబిందుకళలను, సాంఖ్యతారకామనస్కంబులను, మంత్రహఠ లయ రాజయో
గంబులను, మూలాధార స్వాధిష్ఠానమణిపూరకానాహత విశుద్ధాజ్ఞా సహస్రా
రంబు లను చక్రంబులను దెలియనేర్చి యాత్మాంతరాత్మ పరమాత్మజ్ఞానాత్మ స్వ
రూపంబు లెఱింగి సత్పురుషుల నాశ్రయించియుండఁదత్ఫల లబ్ధిఁ గానక కేవలంబు
శైవమతధురంధరుండై యుండెనంతట. 185

క. ఆరాధ్యుఁడు తనువంశా, చారమునకు గురుమహాశ్వ సత్తముఁడు ప్రియం
బారఁగ నతనికిఁ బెట్టిన, పేరును శివదత్తుఁడండ్రు బిసరుహగంధీ. 186

తే. సంతతమ్మును జంగమార్చనలు సల్పి, భౌమవారంబునను వీరభద్రపళ్లె
రంబునిడి వారిపాదతీర్థమున భుక్త, శేషమునఁ దృప్తిఁ బొందుచుఁ జెలఁగు నతఁడు.

సీ. అయ్యావళీ ముఖ్యమైతనరారెడు మిండజంగంబులు మెఱసి నడువ
గౌరఘుమల్లప్పగంగను ననుకంచి కావళ్లవారును గలసి చనఁగ
గుమ్మెత కిన్నెర ల్గూడి వాయించుచు బైరవజోగి వెంబడిని కదల
బసవగంటలు బృహత్పటుశంఖములు మ్రోయ శివరాత్రి జంగాలు చేరికొలువ
తే. లశునతిలపిష్టచూర్ణభాగశనమిసిమి, యుల్లిపచ్చళ్లు పులిదోసె లూరుబిండ్లు
మూటజోలలు చిటిగాళ్లు మ్రోసితేగ, నాఁత డేఁటేట శ్రీశైల మరిగి వచ్చు. 188

తే. వీరశైవంబు ముదిరి యసువేళనైన, హరహర శివా మహాదేవ యనుచుఁ బల్కు
పలుకు సేకాని యిత్తరసంభాషణంబు, లాడఁడెన్నఁడుఁ బెండ్లాముతోడనైన. 189

క. ఆతనికి విశాలయనం, గాఁపరుణి యొకర్తు దనరుఁగమ్మవిరిలకో
రీటరక రౌతులాయము, లోలేజీరసన మనుచులోకులు పొగడన్. 190

క. దానివిలాసపువదనము, దానిచోకాటంపుగబ్బి తళుకులగుబ్బల్
దానిపసమించుదేహము, మానవతీపొగడ శక్యమా విధికైనన్. 191

సీ. నీలాల రుచినవ్వు నెఱివేణి మొత్తమ్ముత్తమ్ములనిరసించఁదగు మొగంబు
గంబూరభుగభుగ ల్గలపించు నునుఁ బల్కు పల్కుఁదు రాణులపసను మించు
మించులసిగ్గించు మెయితీవపొంకంబు కంబుసోయగముల గళముమారు
మారుగుడారము ల్మానినిగుబ్బలు బలుదీవి నగు నితంబంబుమహిమ

తే. హిమమయూఖాస్యయూరులయేపుతెగడు
గడుసు రంభలసోగసు జంఘులుజయించు
నించు విలుకానిశరధుల నేణనయన
యనఘు పదములు కెంజివుళ్ల పహసించు. 192

క. చిపురా వాతెఱ నల్లని, కపురా నునుసోఁగవెండ్రుకలు పత్తడిమేల్
సవురా దేహము ముద్దుల, దవురా యని జనులుపొగడ నాబిడ యమరున్. 193

తే. దానిసెమ్మేను మెఱుఁగు దాఁ బూనఁగడఁగి
పుత్తడివెలంది చిదపలై ముద్ర వేసి
యొఱసియొట్టంబు వడికాఁగి నెఱయఁజిమిడి
కఱఁగి నీరయిపోవును గలువకంటి. 194

ఉ. సారసమానపీనఘృణి సంపద కాంచును నెమ్మొగంబు కా
సారసమానవిభ్రమము సారె జయించును నాభియుక్ సుధా
సారసమానమాధురిని జాల రహించును మోవి చంద్రికా
సారసమానహృద్యరుచి సంతతి మించును గాంతహాసముల్. 195

శా. పున్నాగంబును గెల్వఁజాలు రుచిరాంభోజాస్య వేణీరుచు
ల్పున్నాగంబును నవ్వనోపునెఱయక్ లోలాక్షియానంబులుం
బున్నాగంబును గేరిమీఱి మెఱయుం బూఁబోఁడినూగారుడాల్
బున్నాగంబును మించు నాభిచెలువంబుక్ సారెవర్ణింపఁగన్. 196

క. ఆతనుజయధర్మలీలా, హితవృత్తిక్ గన్బొమలు రహించె ననుచుఁదా
నతనుజ యధర్మలీలా, హితవృత్తి గహించి మించు నింతికుచంబుల్. 197

చ. అది పతిభక్తిమీరక దివంతముదాఁకను నేవఁజేసియిం
పొదవఁగ నారగించి వసనోత్తమభూషణపుష్పగంధసం
పదలను దేలి రేలుప్రియభర్తను సిబ్బెపుగబ్బిగుబ్బలక్
గదియఁగఁ గౌఁగిలింపఁ జనఁగాఁగని కోపవిఘూర్ణితాత్ముఁడై. 198

క. శివదత్తుఁడు హరహరయని, యసలీకిఁబో రంకులాడి యని తను ద్రొబ్బం
గవయసుదిగనుకనాశలఁ, దివురు ప్రతికలిప మోహదీక్ష చెలంగన్. 199

సీ. పదము లొత్తెదనంచుఁ బతిజంఘికలు దన తొడలపైవ్రేసికొ మిడిసిపడును
నడుము పట్టెద నంచు నాథునిచిఱుతొడ ల్పుడికినఁజీయని షొరలునవల
నుపబర్హ మెగఁద్రోయ నుంకించిమోముపై మోముఁజేర్చినఁజూచి ముదుగులాడు
వ్రేల్మెటికెలుదీయ వెసనెత్తి హస్తంబు కుచములపైవ్రేసికొనినఁదిట్టు

తే. బక్కలఁ జేసి కొంగొంటఁ జిక్కఁ బట్టి
కులుకుగుబ్బల నెద త్రొమ్ము గ్రుమ్మి క్రుమ్మి
రతిబలాత్కారమునఁ జేయ ధృతి వహించు
ప్రేయసిని జూచి రోయుచుఁ బ్రోయు నతఁడు. 201

క. ఈలాగు నిచ్చ నిచ్చలు, వాలుగుకెకెంగ్రంబుఁ బూను వానిదురంబుల్
లీల నొనరింపఁ జూచుచుఁ, గాలను బీ రంకులాడి చను మని తిట్టున్. 202

తే. అతఁడుపరసౌఖ్యమునెఱింగి యాసఁబొందఁ, డిహమునం దుచ్ఛసౌఖ్యాప్తి కింతయైన
త్రాతి కిడునట్టి గిలిగింత లైతనర్చుఁ, గాని ప్రియురాలిచేష్టలు గలవ వతని. 203

వ. మఱియును. 204

* * * * * * *

తే. కుడువఁ గట్టను దొడుగను ముడువఁ బడమి, నెంతగలిగినఁ బ్రాయంపుటింతులకును
గ్రామ్యధర్మంబు లేకున్నఁ గలుగు దుఃఖ, మెంతని వచింపవచ్చునో దంతిగమన.

తే. వినుము నానావిధంబుల దినము దినము
రాత్రి రమణుని గదియఁబో రంకులాడి
పోవె యని త్రోయ గుబ్బలఁ బొందు పైఁట
చెఱఁగు బఱుచుకఁ బండు నుస్సురు మటంచు. 207

ఉ. మిన్నక యిట్లు భర్త తనమీఁద విరాళి వహింపకున్న యా
కన్నియ చూచి యీముదిబికారునితోఁ బని యేమి నా కటం
చు న్నిరసించుఁ బంచశరసుందరరూపుల జారవీరులం
గ్రొన్నన వింటివానిమొనకుం గదియించెద నంచు నెంచుచున్. 208

క. వేసిన శివదత్తునకును, సేవలు సేయుటలు మాని చిత్తం బలరన్
భావజనిభు లగుజారుల, త్రోవలు గనుచుండె విరహదోహళకాంక్షన్. 209

చ. చికిలి విభూతిరేఖ జిగిఁజిక్కఁడు కమ్మలకాంతిఁజోక హా
టకమణిభూషణంబులమిటారపుఁడెక్కులమూఁక వాసనా
ధికసుమగంధసంపదల తేటగుసిస్తులవీఁక యొప్పఁగా
నకట విశాలవామసఖి హర్షముతోఁ జరియింపుచుండఁగన్. 210

క. అంతట నితాంతహర్ష, స్వాంతయుతద్యూత జనరవక్షుభితహరి
ద్వాంతిశ్రుతియై నగర, ప్రాంతంబునఁ గోడిపదువు పందెము సాఁగెన్. 211

తే. కావిప్రాఁతలు దారాలు కట్టుముళ్లు, ముష్టులును నీళ్లముంతలు మూలికలును
గత్తులపొదుళ్లు మంత్రము ల్కట్టుపసరు, లెనయ వచ్చిరి పందెగాళ్లుపురేఁగి.

తే. డేగ నెమిలి పింగళి కోడి డేగకాకి, వన్నెలైదింటి కిరులందు వన్నెలందు
రాజ్యభోజనగమననిద్రామరణము, లను విచారించి యుపజాతులను వచించి. 213

సీ. పట్టెజుట్టుది మైలపుట్టమిట్టుది గూబ చిలుకజుట్టుది మూఁగ బిట్టుకోడి
పట్టుమార్పుది యెర జుట్టుది బోరది బూడిదెవన్నెది పొడది సెల్లు
కాలుది గుజ్జుది గాజులగాడునో చలది పండెఱ్ఱది గద్దకోళు
దెఱ్ఱనిదురగలి డీకెలదాశెము నల్లది కొప్పది తెల్లయుండగ

తే. పిల్లవెళ్లది మొద్దుది నల్లయురగ, లనఁగఁ దగుకత్తికా ల్పుంజు లందులోనఁ
బసపుపొవళ్లు కాలంద లెసఁగునట్లు, రావిరేకలు బిరుదులు కీవి గలుగు. 214

సీ. గరుడండు శరభంబు కంచుడమారము రణభేరి కార్చిచ్చు జాతిబొమ్మ
రాముబాణము మిత్తి రాహుత్తి పిడుగు హమ్వీరుండు పుంజుల వేరువిత్తు
గండగత్తెర గుండె గాలంబు మాష్టీఁడు పట్టభద్రుఁడు బెట్టి భైరవుండు
కత్తులపొది సింహ గాలి బేతాలుండు పసులపాతర పాదరసము చిలుకు

తే. టమ్ము సుడిగాలి చక్రంబు నలజడదరి
శూలము పిరంగి వెలినక్క సాలువంబు
కాళరాత్ర్యంతకుఁడు పందెగాండ్రు మెచ్చు
లనెడు పేరులపుంజులఁ గొని ముగించి. 215

చ. చోరఁబడి కాంచి ప్రాఁతలును చుట్టియుఁ గత్తులు వ్రేసి సందిటం
బెరయఁగఁ బట్టి చెక్కఁగఱపించి గి రేర్పడ గీచి నిల్చి కొ
క్కెరయఁగఁ జూచి పందియపు టెంకువ దిద్దుచుఁ జిక్కెవేసి స
ల్లిరి మరిపో యటంచును ఖళీపెళిపుంజులు దన్నులాడఁగన్. 216

క. కృకలాశువులం బుట్టిన, కకపికలా దడచుచుండఁ గాలజ్ఞరణో
ద్రేకడను నిలిచిన శకనా, మకు నొకనాయకునిఁ జూచి మానిని మెచ్చెన్. 217

ఉ. మెచ్చినయింతలో జిగురుమే లడిదంబు బిరాన దూసి బల్
వచ్చనివింటిబోయ చెలిపైఁ బడి నిబ్బరపుబ్బుసిబ్బెపు
న్మచ్చగలట్టి గుబ్బకవ నాఁటఁగ చిక్కనఁ గ్రుమ్మిక్రుమ్మి తా
నచ్చుగఁ జేర్చి యార్చె హరిణాక్షిమనంబు గలంగ నెంతయున్. 218

తే. అపుడు తనుదానె తెలుసుక యబ్జనయన, కులుకు గుబ్బలఁ జిన్నారి కోక్లు రవికె
బిగలఁ బోకము దూడిపోఁ జేర్చి తోడ, శుకునిఁ జూచుచుఁ దనయింటిచక్కి నిలిచి.

చ. అతఁ డొకసీటికాల్వకడ కంతట వే చనితామ్రచూడ శో
ణితయుతహస్తముల్ గడుగు నేర్పున నుండఁగ వానిచెంతకుం
గుతుక మెలర్పఁగాఁ జని శుకుం గని కోమలి కొంకుపాటుతోఁ
గొతుకుచుఁ బల్కె నొంటి నిటు కూడున రాఁదనవంటిదానికిన్. 220

క. అని నీళ్లఁ గాళ్ళు గడుగుచుఁ, జనఁ గావలె నమ్మ చెల్ల సరె తడవాయెం
గన నెవ్వారును లేరని, ఘనకుంతల పల్కుచుండఁ గా శుకుఁ డంతన్. 221

క. ఇంతీ యెవ్వరు లేరని, గొం తేటికిఁ జేసె దెవరు గొనిపోయెదరే
యెంతపనివచ్చినను నిదె, చెంతనె యున్నాఁడ భీతిఁ జెందకు మనన్. 222

చ. విని చిఱునవ్వు నవ్వి భువి వింతలు పో మగవాండ్రు నీగతిం
బనుపడి యొంటి నుండఁగని పల్కుట న్యాయమె యంచుఁ బల్కినీ
వనుదిన మెందు నుందు వెవరైనను వచ్చెద రేల చెప్పుమా
ననవిలుకానివంటి నెఱనాయక యంచు విశాల వేఁడినన్. 223

క. నేనుందు నెపుడు మాపులుగి, లోన న్నా పేరు శుకుఁడు లోలాయతనే
త్రా నారుల మానసములు, పూని కనుంగొనెదు బుద్ధి భూమిఁ జరింతున్. 224

వ. అని చెప్పి నవ్వుచు వెండియు నిట్లనియె. 225

క. ఈపీట నొంపుచిత్రము, గావించెడిపాటిదానిఁ గన మీవఱకున్
నీవైతె జాణ వౌదువు, గావోలు న్మాట లటులఁ గావినఁబడియెన్. 226

* * * * *

తే. అనిన విని యావిశాల యౌరా యటనుచు, మెచ్చి తనమదిలోఁ గల మేలిమెల్ల
దెలిసితివి జాణ వౌదని పలికి యతని, రమ్ము నాయింటికిపు డని నెమ్మి మీఱ. 228

క. త్వరితగతిం దనయింటికిఁ, దిరిగి తిరిగి చూచుకొనుచుఁ దెరవయుఁ జనెనా
సరణిని పడి శుకుఁ డాబిడ, శరణమునకుఁ జనియె వేడ్క సఫలతఁ బొందన్. 229

* * * * *

* * * * *

* * * * *

తే. అటులఁ దమిదీర గుండెడి యాస్థతోడ
ముచ్చటలు దీర నిరువురు మొనసి పెనఁగు
వేళ శివదత్తుఁ డింటికి వేగ వచ్చి
చూచె నాశ్చర్యకోపవిస్ఫురితుఁ డగుచు. 233

వ. ఇత్తెఱంగున. 234

క. ఘర్షించి కనులనిప్పుల, వర్షంబులు గురియఁ జూచు వల్లభునకు నా
ధర్షిణి యపు డేవిధమున, హర్షము గావింప వలయు నని యడుగుటయున్. 235

తే. హంసకులసార్వభౌమ నీ వనుదినంబు, కథకుఁ గథ కిట్లు నన్నడుగంగ నేల
చెప్పు మేలాగు హర్షింపఁ జేసె మగని, ననిన హేమావతిని జూచి హంసయనియె.

క. విను మటుల మగఁడు కోపము, పెనఁగొని ఘర్జించి పలుక భీతిల్లక యా
వనజదళాకారవిలో, చన ధైర్యము చెదరనీకఁ జతురత ననియెన్. 237

క. మరుకేళిఁ గవయ కవ్వలి, కరుగవె చీ రంకులాడి యని నను నిచ్చల్
నిరసింతువు యోగివ గన, నరకా నీవాకె తాఁకె నాకుంజూడన్. 238

చ. పలుమఱు రంకులాడి యని పల్కెడు నీవచనం బమోఘమై
నెలకొని తాఁకె సిద్ధుఁడవు నీమహిమం బదియేల వ్యర్థమై
తొలఁగు నటంచుఁ బల్కి చెలి దూరిన నాత్మతపోవిభూతిచేఁ
దలకొను వాక్యసిద్ధికి ముదంబు గొనెన్ శివదత్తుఁ డెంతయున్. 239

చ. అతుల నిజాధినాథుఁడపు డాత్మమహత్త్వగుణోపలబ్ధికు
త్కట మగు మోదమందఁగను గామినిఁ జూచి నను౦ బతివ్రతా
పటిమ వహించు మంచు బహుభాషలఁ బల్కును పల్కుచున్న నీ
కిట ఘటియింతు హత్య తను వేటికి నేఁటికి నింద వచ్చినన్. 240

తే. అనెడు సతివాక్యమునకు స్త్రీహత్యకులికి, తనదువాక్సిద్ధికిని నద్భుతంబుఁ జెంది
నీవిఁక మహాపతివ్రతాభావమహిమ, వెలయవే యనియోగి దీవించెఁ బ్రీతి. 241

క. అటువలె దీవించుచు నెప్పటియట్లనె వేఱులేనిపక్షంబున న
జ్జటిలుండుండెను జెలియును, బటుముదమున మెలఁగుచుండెఁ బడఁతుక వింటే.

క. ఆరీతి మహోపాయము, నేరిచిన జ్జారుఁ గవయ నెలకొను మన నా
ధార జగజంత యని తెల, వారుటఁగనిభామ కేళి వసతికిఁ జనియెన్. 243

వ. అని ప్రత్యుత్పన్నమతిచెప్పిన విని హర్షంబునొంది నలుండు దరువాతివృత్తాంతంబాన తిమ్మని ప్రార్థించిన. 244

మ. నిరవద్యస్వయశోవినిర్జిత మహానీహారనీహారభూ
ధరపుత్రీశ్వర కావ్యగోత్రవిధికాంతా గౌరవా గౌరవా
కరమందార పటీర శంకర పతాకాతారకా తారకా
దరవిందోద్భవవాహ పథ్యతిథిపాకాహార కాహారపా. 245

అనులోమవిలోమకందము. రామానుజరాజనుత ర
మామరసుమరాగకర సుమాకర సమరా
రామ సరకమాసుర కగ
రామ సురమమారతనుజ రాజకుమారా. 246

తోటకవృత్తము. వారణ వారణ వారణరక్షా
సారస సారస సారసపక్షా
శారద శారద శారద కీర్తీ
హారిమ హారిమ హారిమమూర్తీ. 247

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవిత్రాయ్యలరాజాన్వయసుధావార్ధిపూర్ణిమాచంద్ర నిస్సహాయకవిత్వనిర్మాణచాతుర్యనిస్తంద్ర శ్రీరామనామపారాయణనారాయణామాత్యప్రణీతం బైనహంసవింశతి యనుమహాప్రబంధమునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# హంసవింశతి

## చతుర్థాశ్వాసము.

---

### పదుమూఁడవరాత్రికథ.



రాజితజితవారిధి
వారిధితనయాంశజాతవసుధాపుత్రీ
హారిస్తన కుంకుమఘన
సారమృగీమదసుగంధచర్చితవక్షా. 1

వ. అవధరింపుము ప్రత్యుత్పన్నమతి నలునకిట్లనియె నట్లుప్రభాతకాలంబుఁగావచ్చినఁ
గనుంగొని. 2

క. చిగురాకుబోఁడి యప్పుడు, మగరాజిగిరాయిడించు మందిరభూమిన్
బగరాజిల్లెడు తొఁగరా,జగరాతికి నది రసించు సాయంబైనన్. 3

క. కని జలకమాడి సొమ్ములుఁ, దనరంగ నలంకరించి తరలేక్షణరా
డ్తనయునిపై మోహంబునఁ, జనఁగా రాయంచ చూచి సఖితో ననియెన్. 4

తే. ఆక్కఱుచిఁగల్గు చక్కెర లానవాలు, పెట్టెదవె యొక్కగాథఁ జెప్పెదను వేడ్క
నది నవీనప్రవాళరాకాధరోష్ఠి, వినిన నొక్కింత నేర్పు నీకెనయుఁ సుమ్మి. 5

క. అనవిని చిఱున వ్వొలయం, బని చెఱుపులకథలు చెప్ప పార్థువుఁ జేరం
జననీయ వైనఁ జెప్పుము, వినియెద నన సతికి హంసవిభుఁడిట్లనియెన్. 6

తే. పూర్వమున బ్రహ్మసభకు నేఁబోయి కొంత
కాలమందుండి యజుఁ డంపకంబు నేయ
మానససరంబునకు వచ్చిమామకీన
కులజులను గాంచి భువిఁ జూచుకోర్కి పొడమి. 7

సీ. హిమవన్నిషధమేరుహేమకూటాస్తోద యద్రోణమలయవింధ్యాత్రికూట
మాల్యవన్మంధర మైనాక గంధమా దనసహ్యాపారియాత్రకసువేల

ఋష్య మత్స్య శృంగ ఋశ్యమూక మహేంద్ర సోమాన గోశృంగ చంద్రపృషభ
శాలేయ సుధీరబీజ మతంగ కైలాస, శతకేతు భృగునీల చక్రవాళ ?

తే. కనకమేఘాంశుమత్పుష్పగరుడభద్ర, చిత్రకూట సుదర్శన శేషసింహ
రోహణ శ్రీగిరిక్రౌంచ రుద్ర మత్స్య, సూర్యరోహణముగిరు ల్చూచియంత. 8

సీ. కోరింద నలతుమ్మ గొటికె కోడారయ వెణుతు రూపుగ దంతి వెఱ్ఱినిమ్మ
చిటిగార సుంకేసి చీ కెల్లుదుమ్మయుఁ దెల్లదుమ్మల్లింద కల్లితొట్టి
జమ్మి బలుసు గార చండ్ర పటికి తెల్ల పుష్పిలొద్దుగ జిడ్డు బుడ్డతుమ్మ
కలివిగి గుండ్రయు గచ్చ పెన్నంగయు దుష్టమంగయు భూతతొట్రుకోవ

తే. మాడ్చు చిటికొక్కి-సీకాయ మండ్ర తొఱ్ఱి, వెలఁగ వాకుడు పల్లేరు ములకవేప
నగిరె నీర్గొబ్బి మొదలుగా జగలిగల్లు, కంప లన్నియు వేవేగ గడచి కడచి. 9

సీసమాలిక. జిల్లేడు వెంపలి జిడ్డువెంపలి పైడి తంగేడు తంగేడి తగిడి నుస్తె
ములువెంపలి ములుస్తె గరిజేరు గుంటగల్జేరును దంతిబందారి నేల
తంగేడుమొట్ట బందారి మండుగ బ్రహ్మదండి భూతులసెల్లిదొండి చల్ల
పిల్లిమామిడి చాక పిల్లడ్గు చిత్రమూలము నల్లతీఁగె కోలాకు పొన్న
ముయ్యాకు పొన్నయు మొగబీర తుత్తెర బంకదుత్తెర హంసపాది గంటె
కాను జలుగుమొట్టదామర వెఱ్ఱిసెనగ జంబిరము కాచి నల్లకాచి
శ్రీతులసియు సంబరేణు నేలుసిరి కేశ్వరి నేలవేమూటి చల్లగడ్డ
సహదేవి జుట్టుప చఱిపండి చిటిముటి పెన్నేరు విషబొద్దిపండి దొండ
నెనుటాయి గోమిడి నీరుబచ్చలి ప్రబ్బి వేరు గన్నేరాఁదు బీరనేతి
బీరపేరా ముట్టి పేచరములు గొలిమిడి చేదుపొట్ల యుమ్మెత్త తిప్ప
తీఁగె విష్ణుక్రాంత తీం ప్రెఱ్ఱి చిత్రమూలము దొండతీఁగె ముల్లంగి గొల్ల
జీడెద్దు నుట్టేకు పేగొట్టె చంద్రకాంత, తెఱ్ఱనియబ్బెంద యెఱ్ఱతుమ్మి
కుప్పి సూర్యక్రాంత ముప్పుడు నరవందు గాడిదెకడపర కన్నెకొమర
నల్లగెంజెనవూరి తెల్లగెంజెన యుత్త రేణు గుబ్బిరి సంబరేణు బండి
గురిగింజ గురువింద తురకపత్తియుఁ బత్తి తిలదిడ చబ్బంద నులియచీకె
వెలగ విషముదారి వెఱ్ఱికుందెన మంచికుందెన కలబంద గువ్వగుత్తి
మామెనయును నేలమామెన యటకమామిడి దూల గోవెల మేఁకమేయు

తే. నాకు నల్లేరు నులిజము డాకుజెముడు
నేలత్రటక సింజెయుఁ గోఁచెముడు
బొంతచెము డొల్లియును, సదా ముష్టి మొదలు
గాఁ గలుగునట్టి చిఱుచెట్లఁ గాంచి యంత. 10

సీసమాలిక. రావి మామిడికొండరావి మేడియు బ్రహ్మ మేడియుం జీడిమామిడియుఁ జింత
పులిచింత మోఁదుగు ములుమోదుగును వెల్గ పుల్లవెలఁగ వెఱ్ఱిబిల్ల చిల్ల
బూరుగ కలుగొట్లు భూతపాసిరి కుక్క బూరుగ చిట్టిగొట్టి భూతనెంద
నేరేడు మఱి యల్లనేరేడు పాదిరి తడగూబ తడటేఁకు కడపబట్టు
కడపకొడిశ పాలకొడి శెజ్జిలొద్దుగు చిరిటేఁకు లొద్దుగు జీడిపాల
కలు జువ్వి వావిలి గంధువావిలి యేరు మద్ది మద్దియును నేలొద్దియొద్ది
తెల్లకాంచనము తుందిల మెఱ్ఱికాంచన ముప్పి తెల్లుప్పి నీరుప్పి యుప్ప
తాండ్రచందన మేపి దాసాన మెఱ్ఱదా సానము బందుగ జారజేన
మఱ్ఱివిరికి తొండ్లి మఱ్ఱితూ కిచ్చెడ పెద్దవిరిగి పక్కి గద్దనెల్లి
కాకితూ కందుగుకానుగ వరగోఁగు గోఁగుబొట్టు కచిక్కి గోఁగుకొండ
గోఁగుపొగడ ములు గోరంజలును బెద్ద వెలమ సుంకేసరి వెఱ్ఱిచిక్కి
నారుప సురపొన్న వారిజమును బొన్న నెల్లి మూలుగబిల్లు నెమిలియగుడు
కొండగుమ్ముడు రేఁగు గొరమి సంపఁగికొండ సంపెంగ మారేడు సరళదేవ
దారు గుమ్ముడుమోవి తపసియుఁ గుమ్మర పొల్కి గుగ్గిల మెఱ్ఱపొల్కి వేగి
దేవదా రుసిరికె తిలకము తెల్లన గిరి వేఁప కరివేఁప తురకవేఁప
వేరుపనసగుత్తి వెఱ్ఱినారు పరేల పనస కరకకొమ్మి పలుకరేణి
బండచింతయు నల్లబలుసు సురభి చీకి రేని కూకుడు నెమ్మి ప్రేంఖణమ్ము
భూతాంకుశ మశోక భూర్జపత్రమ్ములు బోళము మంకెనపులుసు గంగ
రేఁగు తక్కిలి ములువేగి భూచక్రము మొక్కస కొక్కస మొల్లమ్రాను
హనుమంతబీర మంకెన గిరికర్ణిక పెడమల్లె కొండముక్కిడియుఁ గోల
ముక్కుదాడిమ బీర మొగలింగ గోదాడు నేదాడు ఖర్జూర మీఁత నేల
తాడి బగిస పోఁక తాడు కొబ్బెరచెట్టు పెద్దమాను షణంగి బెండగలుగు

తే. కణుదు రరుకుడు కాలుగ కాన్గ సన్న
విరిగి సోమింద గున్నంగి దిరిసెనంబు
మొదలుగా గల్గు బహువిధభూరుహములు
నిండి యుండెడుకానలపిండు లరసి. 11

క. వెస జంబూప్లక్షక్రౌం, చసుపుష్కరశాల్మలికుశశ శాకద్వీపా
తెసఁగఁ గనుగొంటి లవణే, క్షుసురాఘృతదధిపయోవిశుద్ధజలాబ్ధుల్. 12

సీ. స్వాయంభువోత్తమ స్వారోచిష బ్రహ్మ దక్ష వైవస్వత తామసేంద్ర
రౌచ్య రైవత రుద్రభౌచ్య చాక్షుష సూర్య్య లనెడు చతుర్దశమనువు లమర

బ్రాహ్మోక్ష దివ్యబార్హస్పత్య సౌరచాంద్ర గురు పావన పిత్రునామకవన
మానమ్ములును గేతుమాల కింపురుష హిరణ్మ యైలావృత రమ్యక కురు
తే. భరత భద్రాశ్వ హరిసంజ్ఞ వర్షములును, భారతేంద్ర కశేతు గభస్తి నాగ
తామ్ర రాహిణి సౌమ్యగాంధర్వ కాఖ్య, లమరు నవఖండముల నొప్పు నవనియందు.
సీ. ద్రవిళ విదేహ మాళవ మత్స్య మళయాళ కొంక ణాంగ విదర్భ కురు పుళింద
చేది టంకణ వత్స సింహళ కర్ణాట మగధ ఘోట కళింగ మద్ర యవన
కుకురు బాహ్లిక పౌండ్ర ఘూర్జర నేపాళ శక వంగ కాంభోజ సాల్వ లాట
సౌరాష్ట్ర చోళాంధ్ర శబర పాండ్య వరాట కుంతల కేక యావంతి కాశి
తే. నాట కరహాట సింధు గాంధార నిషధ, కేరళ తురుష్క పాంచాల శూరసేన
కోస లోత్కల కాశ్మీర కుత్స బర్బ, ర మరు ఘూర్జాఖ్యసర్వదేశములు చూచి.
క. యమునాత్రమసామథ్య, క్షమఁ గమలోత్పలమరందసంగ్రహణాద
భ్రమతిభ్రమద్భ్రమరవి, భ్రమగీతతతాభ్రభ్రసురతరంగిణి చెంతన్. 15
సీ. పొడయెండగాయని పొన్నగున్నలనీడఁ గ్రొమ్ముత్తియపుటరంగులుచెలంగ
గొజ్జంగిపాదరిండ్లపజ్జలఁ బచ్చకప్రములు నిండినద్రాక్షపందిలి తగ
శశికాంతకుట్టిమస్థలులను బన్నీటి పరజల్లు జలయంత్రపాళి దనర
కేళీ కేళాకూళి క్రేవ చక్ర చకోర హంసభ్రమ త్సారసాదికలిత
తే. కలకలారావ విస్తార కమల కుముద, సౌర భాగార నీహార నీరపూర
వీచికావార దుర్వార విహృతి ధీర, శీతలసమీర కాసారసీమఁ గంటి. 16
వ. మఱియుఁ దత్కాసారంబు ననిమిషసంచారయోగ్యంబై యమరావతీపురంబును, శంఖమకరకచ్ఛపాధిష్ఠానంబై యలకాపట్టణంబును, ధార్తరాష్ట్రవిహారస్థలంబై హస్తినగరంబును, బకనివాసంబై యేకచక్రంబును, శంకరాధారంబై కాంతారంబును, శింశుమారచక్రవికాసితంబై మేరువునుం బురుడించుఁ దత్తీరంబున. 17
క. పల్లవిత కలిత పుష్పిత, సల్లలిత మరంద వళిత సత్ఫలిత మహీ
జోల్లసితాభ్రంకషయై, యుల్లము రంజిల్లఁ జేయు నొకవన మొప్పున్. 18
ఉ. ఆవనసీమ నొక్కతరు నంబరచుంబితశాఖియై ముదం
బావహిలంగఁ జేయఁ గని యాగమనశ్రమముక్ క్షుధార్తియుం
బోవ ఘటింపఁ బూనియును భూజముపై వసియించి నాకగం
గావనజాతజాతబిసఖండము లానుచు నుంటి వయ్యెడన్. 19
ఉ. కొండలు క్రిందుమీఁదుగను గూల దిశావళి వ్రీల నుష్ట్రవే
దండము లుర్వి వ్రాలఁ ద్వరితంబున వారిధు లింకి క్రాలభ్ర

ష్ఠోండము తూల నాదిమమహాహిపసూకరకూర్మమూర్తు లొం
డొండఁ గలంగి సోలఁ జటులోద్ధతి నుర్లను నేలయ న్స్మగిల్. 20

వ. అప్పుడు. 21

చ. హరిశిఖిదండిదైత్యవరుణానిలయక్షపభర్గు లెక్కి యా
మరకరిమేషవాహరిపుమానవనక్రమృగాశ్వనందులన్
గురుపవిశక్తిదండవరకుంతగుణధ్వజఖడ్గశూలభృ
త్కరులయి కుంభయంత్రగతిఁ దాల్చిరి దిక్పురసైన్యసంగతిన్. 22

క. ఆతఱి నే నాకసమున, కాతతసంరంభగతుల నతిజవ మొప్పం
గాఁ దెలివి నెగసి చూడఁగ, భూతలచలనం బడంగి పోయినపిదపన్. 23

క. ధరణీసుర భూభృద్వి, ట్చరణజభటరథగజాశ్వసద్వస్తులచే
నిర వొందు పాండ్యభూమిని, బరిపూర్ణం బనఁగ నొక్కపట్టణ మున్నన్. 24

తే. కని మహామోద మొనరింపఁగాఁ బురంబు
కాపురంబుగ నుండెడు ఘనజనముల
కలిమి బలిమియు వీక్షించు కాంక్ష వొడమి
యొక్కసౌధంబుపై డిగ్గి యుంటి నందు. 25

తే. పరకతలగుడ్డ యొకపాటిపచ్చడంబు,ముదుక నీర్కావిదోవతి మొలనుసంచి
తిత్తివెండుంగరము వ్రేలహత్తి యొప్ప,నుండు శతుఁ డనుపేదనియోగి యొకఁడు.

సీ. క్షేత్రఘాతంబులస్థితులు వక్కాణించి సౌవర్ణగణితోక్తసంఖ్య దెలిసి
మిశ్రితగణితార్థమిళితమనస్కుఁడై గాఢప్రకీర్ణకగణిత మెఱిఁగి
త్రైరాశికాద్యంతసారాంశము గ్రహించి సూత్రగణితములు జొచ్చికలఁచి
మఱిభిన్నగణితంబు మార్గమెల్లను గాంచి పరగణితంబులు పారఁజూచి

తే. నిఖిలసిద్ధాంతసూత్రము ల్నేర్చి జగతి
గణకకులసార్వభౌమత్వగణనకుఁ దగి
గణితమర్మజ్ఞుఁ డితఁ డని ఘనులు మెచ్చఁ
దెలిసి యతఁ డెంతలెక్కైనఁ దేటపఱుచు. 27

గణితముపేరులు.—

సీ. త్రైరాశికప్రకీర్ణ సువర్ణపంచరాశికమేరుపౌర్ణరాశికసమాధి
కారవీరాచారఘాతకుంటాహ్వయచ్ఛాయార్యభటబృహజ్జాతకోత్క
లితసప్తరాశికలీలావతీవర్గ వర్గమూలక్షేత్రవాస్తుభాగ
గణితసారచతురంగప్రశంసౌభళీ నాదీయబీజభిన్నవరాశి

తే. ఘనఘనామూలశిల్పిసంకలితసూర్య, సోమసిద్ధాంతయుంగలబళోధరత్న

ఘట్టికై త్రైరాశ్యాదిగణితతతులు, దెలిసి యతఁ డెట్టిలెక్కైనఁ దేటపఱుచు. 28

తే. సరవి గుడికట్టుగా చెంగ సరసి వ్రాసి, యంతకము లేసి కులవర్గు లాయకట్లు
దీర్చి దినవహీనపరగలి ప్రతీర, సారవణి నిర్ణయింప శేషాహి యతఁడు. 29

చ. చదువులుచెప్పి చూచె మఱిసారెకుఁ గూలికి లెక్క వ్రాసి చూ
చదయతఁ గోలుకాఁ డగుచు నన్నిఁట మందుపల న్నటించి చూ
చదియునుగాక రాయసపుటార్యుల ఘంటము లాకు దుద్దులన్
వదలక మోసి చూచె నొకపట్టునఁ బొట్టకు లేక తక్కినన్. 30

క. పొరుగిరుగువారికలిమికి, గుఱిగాఁ దా నెంతకూడు గుడుచుచు వీటం
దిరుగాడి ప్రొద్దుగ్రుంకెను, వర కొకపాలికకుఁ గొలుచు వడిఁ గొని తెచ్చున్.

తే. తెచ్చి సుఖమతి యనునామధేయమునను
పరఁగు ప్రియురాలిచేతి కేర్పడఁగ నీయ
నాబిడన్నంబు సంకటి యంబలియును
జేయ నమరేయివేళ బోనేసి పోవు. 32

క. అతఁ డీలాగున గ్రాస, స్థితికై యూరెల్లఁ గలయఁ దిరుగాడంగా
నతనాలు మరునికేళికి, వెతఁగొని తిరుగన్ భుజంగవీరులఁ గలియన్. 33

క. ఒసపరి పగలది ముగ్గుల, నసియాడెడుగొను గలది యందము గలపైఁ
డి సరైనమేనుచాయల, పస గలదని విటులు దానిపని కలవసుచున్. 34

తే. ఎనయ నేవేళ నెంతైన నేపురేఁగి
పురిని గలజారు లత్యంతమోహు లగుచుఁ
గ్రుక్కిళులు మ్రింగికొనుచు నొక్కొక్క రొకరె
తిరుగుచుందురు దానింటితెరువుఁబట్టి. 35

ఉ. ఇందుఁడు కందునిద్దపురహిం దగు సుందరిమోముగోము తా
నందమి నిందిరేందుముఖనందనుఁడుం దనడెందమందు నిం
దిందిరకందబృందకచదృక్తతిచందముఁ జెంద జాళువా
లొందమిఁ గుందు జారులిఁక యుఁగ్మలిఁ బొందమిఁ గంది కుందరే. 36

శా. నెత్తావు ల్వెదచల్లుపుష్పలతల న్నెమ్మేను సింగంపురా
మొత్తంబున్ నునుగౌను శ్రీలగరిమంబున్ వీనులుం దమ్ము ద
క్కొత్తుం గ్రొవ్విరిగుత్తులన్ మినుకులొల్కన్ గబ్బిచన్నుబ్బులున్
నెత్తమ్మిన్ గళదేరుమోము దెగడు న్నీమాటి రంభన్ నగున్. 37

* * * * *

*   *   *   *   *

చ. దుసికలఁ జారుచీఁకటుల దూఁకొనుచుండెడుకీలుగంటుపైఁ
బస పొనరించునిగ్గు గల ఫాలతలంబునఁ జాదుబొట్టు దృ
గ్వసతికిఁ గజ్జలంబు నరకాలున నంచులుఁ జీఱుచీరఁ దా
రసమగుపుష్పకంచుకము రంజిలఁగాఁ జరియించు వీథులన్. 40

తే. ఇటులఁ జరియింపఁ గా దాని యెమ్మె లెఱిఁగి, వట్టియనుమానములచేత బెట్టుగుంది
కని విరూపినిఁగాఁ జేసి కాంతవీడి, చనియెద నటంచు నెమ్మది శకుఁడుఁ దలఁచి.

క. ఒకనాఁటిరాత్రి యింటను, సకియకడం బవ్వళించి సంభ్రమమునఁ బొం
ద్రకదేశమునకుఁ జనియెద, నొకపని కని వేగ యామ ముండెడువేళన్. 42

తే. పయనమై లేచి పోవుచో భార్యతోడఁ, జెప్ప నొక్కింతదూర మచ్చెరువుబోఁడి
సాగ నంపి బహిశ్శంక కేగ నతఁడు, దిరిగి కిటుకంచి వేగ మందిరము సొచ్చి. 43

ఉ. దూలముమీఁదియట్టుకను దొంగవిధంబున నిశ్చలాంగుఁడై
తాలిమిఁ జిక్కఁబట్టి కులతామరసేక్షణచర్యలెల్ల నా
మూలముగాఁ గనుంగొనెడు బుద్ధిని నాశకుఁ డుండునంతఁ బ్రా
క్శైలశిఖాగ్రభాగమున సారసమిత్రుఁడు దోఁచె నంతటన్. 44

క. పనిపాటఁ దీర్చి సుఖమతి, పనివడ నేఁ డింటితోడును బాసెఁ గదా యం
చును వెల్వడి చని వీథిని, మనసిజవేదనల జాలి మాలి తిరుగఁగాన్. 45

సీ. గౌరిపంచాగంబు గౌళిపంతులపంచపక్షుల శకునము త్రైవఁడికంటి
పలుకులరీతులు ప్రశ్నభాగంబులు గల్యాలు గూయుఁగఁ గలుగుమేలు
కీడును బోచిళ్లబా డెఱింగెడునేర్పు దిక్కు విదిక్కులు దెలిసి నుడువుఁ
దుమ్ములక్షణములు తొడరు కాకరవంబు సాముద్రికస్థితిఁ జతురమహిమఁ

తే. దెలియ నేర్చినయొకమహాధీరవరుఁడు, శకునవిద్యావిచక్షణాధికుఁడు సౌకు
మార్యరేఖల మారట మారుఁడైన, యవనిదివిజుండు మతిమంతుఁ డనెడువాఁడు.

క. ఎదురైనఁ జూచి సుఖమతి, కదియం జని వాని సొబగు కలిమికి మోదం
బెదనొంది యతని నో నవ, మదనా యని పిలుచునంతమాత్రనె యతఁడున్. 47

*   *   *   *   *

మ. అటులం దోడ్కొనివచ్చుచోఁ గులుకు టొయ్యారంబుగాఁ జూచి చో
క్కటపుఁ జిబ్బెపుగబ్బిగుబ్బనెలవంక ల్సామ గాన్పింపఁ బై
పట మొక్కింత సడల్చుఁ బచ్చిదొరలన్ భాషించు లేనవ్వుతో
సటలుం జేష్ట లొనర్చుఁ బైపయిఁ బడున్ జారుండు హర్షింపఁగన్. 49

చ. నిలయములోని కిట్టు విటునిన్ వెసఁ దోడ్కొని వచ్చి హెచ్చి కం
బళము ముదంబునం బఱచి పల్లవుఁ డందు వసించినంత న
య్యాళికచ యెక్రియం గనెనొ యట్టుకపై నిజభర్త యుండుటం
దెలిసిన భీతిలేక సుపతీ యపు డేమని బొంకెఁ జెప్పుమా. 50

చ. అని యలవాన జారిపులుఁ గా వనజాక్షినిఁ జేరి వేఁడినన్
విని తలపోసి చూచి యిది వింతసుమీ తెలియంగలేను నే
ర్పున నది భర్తకింపు మడఁ బుట్టఁగ నెట్టులబొంకెఁ జెప్పవే
యనఁ గలహంసవంశకలశాంబుధిచంద్రుఁడు కాంత కిట్లనున్. 51

క. విను హేమావతి సుఖమతి, తనవల్లభుఁ డటుకమీఁద దాఁచుక యున్నాఁ
డని తెలిసి ధృతి చలింపక, యనుపమచాతుర్యధుర్య యై విటుబ్రోలన్. 52

క. పక్కకిడి సద్భర్తని, మ్రొక్కి కనుంగీటి శకునములు చూడు వరుం
డెక్కార్యంబున కేగెనొ, యక్కార్యము తెలియఁగ సఫల మౌనో కాదో. 53

తే. లెస్సఁగాఁ జూచి చెప్పుము లేమిచేతఁ
జనిన నావలె శీఘ్రంబె సఫలుఁడై సు
రక్షితంబుగ వచ్చునో రాఁడొ యనుచుఁ
దెలుప యడిగిన నాస్వైఁగఁ దెలిసి యతఁడు. 54

సీ. అంగుళిక్రమమున నశ్విని భరణియుఁ గృత్తిక రోహిణి మృగశి రార్ద్ర
పొసఁగఁ బునర్వసు పుష్య మాశ్లేషయు మఖ పుబ్బ యుత్తర మఱియు హస్త
సరవిఁ జిత్రయు స్వాతి వరఁగ విశాఖానురాధలు జ్యేష్ఠయు రమణ మూల
పూర్వోత్తరాషాఢ లుర్విని శ్రవణ ధనిష్ఠలు శతభిష ప్రోష్ఠపదలు

తే. నుత్తరాభాద్ర రేవతు లొనర నెంచి
మేష వృషభ మిథున కర్క మృగప కన్య
కా తులాళి ధనుర్లగ్న కలశ మీన
రాశి సంఖ్యలు వరుస నేర్పడ గుణించి. 55

తే. సూర్య శశి భౌమ బుధజీవ శుక్రమంద, రాహు కేతుగ్రహస్థాన రాశికూట
చారచారోపచయకేంద్ర సారసీచ, పరమస్వోచ్చాంశలగ్నము ల్పదిలఫలిచి. 56

తే. జన్మకర్మసాంఖ్యాతిక సాముదాయ, కాంగజామిత్రవైనాసికారివామ
పార్శ్వవేధలులత్తలు భాపమస్వ,భావనీచాస్తమయములఁ బరిహరించి. 75

సీసమాలిక. ద్వాదశాబ్దాబ్దమాత్రగ్రహామాతృనక్షత్రాంశరాశిమాసదిన మరసి
పద్మసింహాసనపణకూర్మనరచాప కుంతలఖలజీవ కుంభపర్గ
శనిఖడ్గరథగజాశ్వవ్యూహనాడికాదివ్విధచ్ఛత్ర ద్వితీయపంచ
విధదశవిధరాహువృశ్చికలాంగూల పంచసప్తశలాక పక్షిడింభ
కామాఖ్యతోర్మణగౌళిశుతశ్యేన యాత్రాత్రి కాలసూర్యఫణిజయక
ఘోరకాలానలగూఢకాలానల భూచరఖేచర పుణ్యభూమి
చంద్రకాలానలసంకటసూర్యకాలానలరాహుకాలానలకరి
పర్తులభాస్వరవామగౌడద్వితీయతృతీయమాతృకాచతురదీర్ఘ
వర్ణేశ్వరాహ్వాదైవతయోగతుంబురు ప్రస్తారసర్వతోభద్రకులకు
లాలకోటామహాలక్ష్మీనఖక్షితివలయలక్షక్షేత్రవాలభూమి

తే. ఘనపుళిందకొల్లాపురి వెనకపటక, కాలరేఖమహామాలికానిరామ
యాఖ్యలలరారుచక్రము లందు బీజ, పంక్తి లిఖియించి తత్ఫలాఫలము లరసి.

క. ఈలాగుచక్రముల గ్రహ,జాలము లిఖియించి చూచి చంద్రాస్యవరుం
డాలయమున దాఁ గుండుట, కాలజ్ఞుఁడు దెలిసి పలికెఁ గౌతుక మెసఁగన్. 59

తే. కడుపులోఁ జల్లగదలక కలికి వినుము
నేఁడు రేపటఁ దలపువ్వు వాడ కతఁడు
రాఁగలఁ డటంచు శపథ మేర్పడఁగఁ జెప్పి
యతఁడు దానిల్లు వెలువడి యపుడ చనియె. 60

ఉ. ఆసమయంబునందు శతుఁ డట్టువపై వసియించి యుండి యెం
తో సుముఖత్వ మొప్పఁ గని తొయ్యలిభక్తికి సచ్చరిత్రలీ
లాసుగుణప్రసిద్ధికి భళా యని మెచ్చుచు డిగ్గి వచ్చి రా
వే సరసీరుహాక్షి యని వేగమె కౌఁగిటఁ జేర్చి వేడుకన్. 61

క. ప్రమదా నీపాతివ్రత్యము భక్తియుఁ గంటి సందియము లే దిఁక నం
చు మనోరాగంబున శతుఁ, డమితస్తుతు లొనరఁ జేయ నది యిట్లనియెన్. 62

తే. కాంత నే నెన్నఁ గోరాదు గాక నన్నుఁ
బోలఁ గలసాధ్వు లున్నారె పుడమిలోన
ననుచుఁ బతితోడఁ జెలరేఁగి యాడుకొనుచు
నిండుమోదంబున సుఖాన నుండె నపుడు. 63

చ. అని కలహంస చెప్పిన నయారె కథాస్థితి యంచు మెచ్చికొం
చును దమనోదయప్రభలు సుందరి గన్గొని యింటిలోనికిం
జని పవలెల్లఁ బోఁగడపి సారసమిత్రుఁడు పశ్చిమాద్రికిం
జనినయనంతరంబ మనుజప్రభుపై విరహంబు మీఱినన్. 64

సీ. కళదేరు కస్తూరితిలకంబు వాసన ల్లపనసంఘములకు లంచ మొసఁగ
నవరత్నతాటంకవివిధకాంతిచ్ఛటల్ నునుఁజెక్కుజిగికిఁ గానుక నొసంగ
నలరుమానికపుసోయగఁపుదండల టెక్కు కలితాంగదీప్తికిఁ గట్న మిడఁగఁ
జెంగావిపని పెంపు చీరంచు సరిగడాల్పదశోణఘృణులకుఁ బగిడిఁబెట్ట

తే. మదనమదహస్తివిడివడ్డమాడ్కిఁ బడఁతి, పుడమి యొడయనికడ కేగ బెడఁగునడల
నడుచువడిఁ గనుంగ్రొమ్ముడి సడలి విరుల, జడి పొడమ నిల్లువెలువడి చనఁగనపుడు.

క. కని రాజహంసవరుఁ డి, ట్లను భళి మేల్జాణ వౌదువౌ సొగ సమరన్
జననాథు నెనయఁ బోయెదొ, విని సొమ్మొకకథ యుటన్న వెలఁ దిట్లనియెన్. 66

మ. కలహంసాధిప నీస్వబుద్ధి నిటులం గల్పించెదో కాక పె
ద్దలచేఁ బూర్వము విన్నవాఁడవో మహాదైవప్రసాదంబో విం
తలుసు మ్మట్లు వచింప నన్యులకు మేధాశక్తి నిక్ బోలువా
పలు లేరింక భళారె చెప్పు మనుచున్ రాజాస్య ప్రార్థించినన్. 67

---

## పదునాల్గవకథ.

క. ఆమానసౌక మభినవ, తామరసమరందబిందుతరబృందంబుల్
నేమించుగుఱియు వాక్కుల, హేమావతి కనియె మోద మిగు రొత్తంగన్. 68

చ. వినుము విదర్భదేశమున విశ్రుతమై సిరులందు పహ్వాలం
బన నొకపట్టణం బమరు నచ్చట నొండొకవైశ్యుఁ డెంతయుం
దనరు హిరణ్యగుప్తుఁ డను నామముతోడఁ దదీయభార్య హ
స్తిని యనుపేరునం బరఁగుఁ జెప్ప నశక్యము దానివైఖరుల్. 69

క. మిలమిలమిలఁ దళుకులజలు, పొలయలరుల వలపుగులుకు పొలతుక నవ్వన్
మొలకరిక ల్చలదలకలు, చెలిసొలపులపలుకు లలరు చిలుకలకొలికిన్. 70

క. విరులా నగవులు నీలపు, సరులా కురు లుబ్బుగబ్బిచన్నులు జాళ్వా
గిరులా యూరు లనంటుల, సిరులా యని జనులు మెచ్చఁ జెలువ చెలంగున్. 71

క. చిందం బనఁదగు గళమును, గుందమ్ములతీరు రదనకోరకపంక్తుల్
మందమ్ములు గమనమ్ములు, నందమ్ములు పొగడఁ దరమె యతివపదమ్ముల్. 72

ఆ. కలువచెలువు చెలువుఁ గైకొనుకన్నులు, జగ మెఱుంగురంగు జిగి మెఱుంగుఁ
గులుకు దొలుకు మొలకగుబ్బల పసగల, వనిత మేలు కొక్క వనిత మేలు. 73

సీ. బలితంపుఁ బులినంపు వెలఁబెంపు జఘనంబుఁ బోఁడి మెన్నఁగ నొక్కనాఁడు పట్టుఁ
విరితమ్ములను గ్రమ్ము సిరిజిమ్ము వదనమ్ము చెలువ మెంచుట కొక్కనెలయుఁ బట్టు
నిరుతెప్పుడును గుప్పు నెఱికప్పు గలకొప్పు ప్రణుతింపగా మహాబ్దంబు పట్టు
జితజంభ కరికుంభ తతడింభ కుచకుంభ యుగ మెన్నుటకు నొక్కయుగము పట్టు

తే. జొక్కటపుఁజిక్కగమినిక్క టెక్కుజక్కు, సుఖములనుతింప గల్పకాంతంబుపట్టు
గెంజిగురు సంజకెంజాయపుంజిఁ దెగడు, పదము లెన్నంగ బ్రహ్మకల్పంబు పట్టు.

క. ఘనజఘనస్తనయుగములు, వెనుకను దనుమోపిలె నుద్దవిడి నొత్తంగాఁ
జనలేక యూరుమరుఁగుల, బనుపడ దాఁగె ననఁ గొను భామకుఁ సనరున్. 75

సీ. విష్ణుపాదంబంటు వేమఱు మేఘంబు చంద్రుండు ముట్టె నీశ్వరుశిరంబు
తీర్థంబులోఁ గొని ధృతి నిల్చె శంఖంబు కోరి ప్రసాదంబు గొనె ఘటములు
దండనుండిన సాధుతరుల దాఁటె నులత లతనుధర్మములతో డనియె విరులు
పుణ్యానదీనదంబుల నిల్చెఁ బులినమ్ము లలసితామహునాజ్ఞ నలరె నంచ

తే. కుంతలానన కంధర కుచసుబాహు, నఖకటీయానపటుశోభనత వహించి
దీటురావే మటంచును దృఢమనీషఁ, జెలియ యంగమ్ములకుఁ బాస చేసినటుల.

ఆ. మొగము నిండియుండు మోహంపుఁగన్గవ, యుదము నిండియుండు నుబ్బుచనులు
పిఁపు నిండియుండు వేనలిజొంపంబు, దానిఁ బొగడఁ దరమె మానవులకు. 77

క. ఆహస్తిని యౌవనము, త్సాహమునన్ బిడ్డపాపసంపడి లేమిన్
మోహానతరవిటవృషభ, వ్యూహములకు నల్లెత్రాఁటియొఱపున మెఱయున్. 78

చ. మిడిమిడి గాని చేకటులు మేలిమిసూనలదండ జోడుబాల్
కడెములు సందిబొందె విడి కమ్మలమించులమించుమించులన్
నిడి బుగడల్ జరాసరిహాణీలఁ దనర్చినకట్ట దండజో
గడ కుతికంట్లు సూసకము ఘల్లను మెట్టెలు పూని వీఁగుచున్. 79

క. అది గరగర నగుపురుషుం, డెదుటం బడ వీఁడు జీవితేశ్వరుఁ డయినన్
మది గలదుఃఖం బెల్లను, దుదముట్టు నటంచు మోహ దుర్దశ నొందున్. 80

వ. అది మఱియును. 81

చ. ముదమునఁ బల్లెబట్టలకు మూఁటకు ముల్లె కటంచు నాథుఁ డిం
పొదవఁగ నేగ జారజనయూథహితప్రదభాగధేయ మై
కదిసి చరించుఁజిన్నెలను గాసిలఁజేయుచు మోహకాంక్షతో
మదనుఁడు సొనచిమ్ములు సుమాళముతోఁ గుతఁ జిమ్ముచుండఁగన్. 82

వ. ఇట్లు సంచరించు నయ్యవసరంబున. 83

సీ. హారావి యొడ్డాణిభారాదులను పచ్చ గోనెలు తణగాలు గోత్రములును
నూలాసునగలు కంట్లాలు కంబడికట్లు మూఁటలు చిక్కాలు బాటదుండు
వలలావణము పట్టి వారతుకొక్కలును సుంకము బీటికాసులును మగలు
కాపలి దేవళ్ల కాసులు కుప్పబత్తెము విశేషము దోపతీర్వ యర్థ

తే. మాన్యములు తరుగువిడుపునుమసుపుమణియు, గానికోల్కానిబంట్రోతుకరణములకు
నారిపెట్టి బసివిగణాచారు లచట, వాదిలెక్కలు రాఁబట్టువాఁ డొకండు. 84

ఉ. సుంకరకొల్వుకాఁడు సరసుం డనుపేరిఁటవాఁడు చూడ నే
ణాంకవసంతకంతుల జయంతుని నెంతయుఁ బోలువాఁడు ని
శ్శంక నలంకరించుక సుంకారున వీథికి వచ్చి యప్పుడా
పంకజలోచనం గని సెబా సని మెచ్చినయంతలోపలన్. 85

చ. బొగడలు చారుచెంగలువబొందల మేలకిపువ్వు ఘట్టి సం
పఁగి సిరితేఁటిమేల్గనిన పొగశిరీషపుగొష్పఫేషుమేల్
జిగితొగడాలు జాజిబరిసిం గొని చిల్కలవాజి నెక్కి పుం
డెగుపను గంతుపొదుప హదే యని యార్చెద బొమ్ము గ్రమ్మినన్. 86

సీ. వ్రీడాసహిత్థప్ర వేగోన్మదో గ్ర రోష ప్రదోషవితర్కచపలదైన్య
పరుషసత్రాసకచరమలీలాపనిర్వేదనాసూయవిషాదగర్వ
మోహాంచితాస్మృతిమోహనమాధుర్యజడగు ప్తిధృత్యపస్మారహైన్య
హర్షవిజ్ఞానశంకాలస్యసుభనామధేయముల్ గల్గి వర్తిల్లునట్టి

తే. ముప్పదియు మూఁడు సంచారములను మగ్గి, స్వేదవైవర్ణ్యరోమాంచవిశ్రుతాస్య
కంపముల్ ప్రళయస్తంబకము లనఁ జను, సాత్వికపుభావములచేత జడిసి తెలిసి.

సీ. సాక్షాత్కరించిన చంచలాలతికయో మాటాడనేర్చిన మణిశలాకొ
జీవంబువచ్చిన చిత్తరుబొమ్మయో కడుతూపుదాల్చు శృంగారరసమొ
చేష్టలు వెలయించు చివురుపూరెమ్మయో చెఱలాడుజాబిల్లిచిన్నికళయొ
కలితరేఖ నటించుకమ్మనెత్తావియో మోహింపఁ జేయు సమ్మోహనంబొ

తే. కాకయుండిన నీతళుక్కు కాంతిముఖము, సొగ సలంకృతికళయును సురభిశోభద
విభ్రమంబులు గలవె త్రివిష్టపముల, నిండి యున్నట్టి చక్కని నెలఁతలందు. 88

క. కరములు సుమలతికా శ్రీ, కరములు చిఱునవ్వు లబ్జకరములు పద్మా
కరములు నాభీరుచు లా, కరములు సొగసులకుఁ జెలికిఁ గలయవయవముల్. 89

క. నారికెన సఖులు లేరే, లేరే దొరఁ దెగడునిటలలీల లయారే
యారేవృనమరునారే, నారేఖకుఁ దనుఘనాళి నాఁగను మెఱయన్. 90

క. బాలాదృక్తతి వాలా, వాలాఱుంగన్ను లతులవనజశ్రీలా
శ్రీలా చెవులు సులీలా, లీలావతికంతరవము లెరబాబాలా. 91

సీ. శశిరేఖశశిరేఖ సత్కళాసౌందర్యములు మాయఁ జేయు నిచ్చెలువతీరు
పద్మినీపద్మినీపరిమళజాతుల నలరింపుచుండు నిక్కలికిసొరు
రేవతీరేవతీరేఖావిలాసముల్ తలకింపఁ జేయు నిత్తరుణిమిఱుఁగు
వరహేమవరహేమసురుచిరలీలలు గఱఁగంగఁ జేయు నీకాంతహరువు

తే. తారతారను దారను దారసించు, భద్రభద్రను భద్రను బరిహసించు
నార యిట్లుండ వలదె శృంగార మనుచు, మెచ్చి పల్మాఱుబలు మోహ మెచ్చి కెరలి.

క. మిఱు మైనయాకృశాంగీ, మణి నిప్పుడు మోహినీసుమతమంత్రాక
ర్షణకళ నాకర్షించుక, కణకం బలుగతుల రతులఁ గవిసెద ననుచున్. 93

క. మది నూహచేసికొని తన, సదనంబున కపుడె వచ్చి చలమునఁ దన్నున్
మదనుం డేచఁగఁ దమిచే, నొదవిన యొకయమృతసిద్ధయోగమునందున్. 94

సీ. వైష్ణవి కౌమారి హరాహి చాముండ బ్రాహ్మి మహేశ్వరి బగళ లలిత
కాత్యాయ నీంద్రాణి కాళరాత్రి భువనేశ్వరి మహామాయ పంచదశ దుర్గి
భగవతి మాతంగి బాల మహాకాళి కామేశ్వరియు భద్రకాళి శక్తి
మలహారి కృష్ణాక్షి మాధవీ శాంభవీ శాకంభరియు లఘుశ్యామలాంగి

తే. మోహినీ కామరాజాఖ్యముఖ్య దేవి, రాజరాజేశ్వరియు మంత్రరాజరాజ
ముఖి వరూపిణి భైరవి ముఖ్యమూల, మంత్రములలోన మోహినీమంత్ర మరసి.

సీ. కడుభక్తి శుక్లపక్షమునఁ బుష్యార్కమినాఁడు హస్తిని వీథి నడుచువేళఁ
గుడియడు గిడుమన్ను గొని తెచ్చి శయనమందిరము గోమయమున నెఱయ నలికి
మధ్యమంబున నెట్టిమంటిప ట్టిడి పసపున మ్రుగ్గొసఁగి మధ్యమునను మన్ను
నెఱపి యాపైని నన్నెలఁతరూపము వ్రాసి చుట్టుయంత్రము గురుస్తుతి యొనర్చి

తే. మొదల నోం శ్రీం వినిర్మించి మోహ మోహి, నీపటుస్వాహయనిమంత్రనియతిఁదీర్చి
యందు దిగ్బంధన మొనర్చి యరుణగంధ, పుష్పదీపాదులకు లెస్స పూజఁ జేసి.

ఆ. లక్షజపముచేసి లక్షణయుతముగఁ, దద్దశాంశము మధుతర్పణంబు
తద్దశాంశ మగుచుఁ దగు పలాశలతాంత, హోమవిధియుఁ దీర్చు చున్నయపుడు.

సీ. మినుకొప్పు నునుగొప్పు మిసమిస ల్దూలాడఁ గన్నులధళధళ మిన్నులాడ
బునుఁగిడ్డ నెఱపూతఘుగఘుగ ల్చెఱఁలాడ గుబ్బలచకచక ల్ద్రొబ్బులాడ
జిగిపూని తగుమేనిధగధగ ల్దిరుగాడ నగుమోము నిగనిగల్ నాట్యమాడ
గుమిగూడుసరిదండఘుమఘుమ ల్పొరలాడ నందెలఝుళిఝుళి ల్చిందులాడ

తే. నెదుట సాక్షాత్కరించు మోహినికి నతఁడు
గరిమెతో లేచి మ్రొక్కినఁ గరుణఁ జూచి
తనకుఁ బూర్ణాహుతి యొనర్చి తప్పకుండఁ
దంత్రము ముగింపుమా నీవు దలఁచినట్టు. 98

క. వర మొసఁగెద నన నటువలెఁ, జరిపి మనోజాత పంచశర యని యంత్రా
వరణము దుడిచి మదీప్సిత,ము రయంబునఁ దీర్పు మనిన మోహిని యంతన్. 99

తే. మంచి దని యచ్చెలిని నావహించి శక్తి, తెచ్చి ముందట నిల్పి యదృశ్య యైన
సంభ్రమంబున సరసుండు సరసగతులఁ, బరవశత్వంబు నొందించి భ్రమను గొల్పె.

చ. కనుఁగవ విచ్చి చూచి యల కామిని యెక్కడి దీనికాంత మీ
ఘనుఁ డితఁ డెవ్వఁ డిట్టిరతి గల్గుట యేమని విస్మయంబుచే
మనమున నెన్ని యే మయిన మంచిదె నామదిఁ గోర్కెఁ దీర్చెఁ బ్ర
బ్భినమకరాంకు నింకఁ దనభృత్యునిగాఁ బని పూని యేలెదన్. 101

వ. అదియునుంగాక. 102

తే. భద్రుఁ డన దత్తకుఁ డనంగఁ బరఁగు కూచి, మార పాంచాల విట పీఠమర్దనాగ
రిక విదూషకు లనఁ బ్రాషరీతి మెలఁగు, నాయకులవంటి రసికుఁ డీనాయకుఁ డని.

* * * * *

* * * * *

వ. ఇట్లు విహరింపుచుండి యొక్కనాఁడు. 106

క. మధ్యాహ్నవేళ జనతా, రాధ్యం డగుసరసుఁ డలరి రతిపతికేళీ
సాధ్యత బుద్ధిమతాంకిమ, సాధ్య మ్మని యావధూటి సదనమె చేరెన్. 107

తే. చేరినప్పటిసరసునితీరుఁ జూచి, భుజము లుప్పొంగి హస్తినీపుష్పగంధి
కలయఁబడి మఱి పన్నిటఁ గాళ్లుగడిగి, మేల మాడుచుఁ దోడ్తెచ్చెమెచ్చు హెచ్చ.

సీ. జీవదంతపుజగాజీసినఖాసుమేల్తళుకుటద్దపుబిళ్ల బెళుకురవలు
వింతసంతనఁ జేసి విప్పుగాఁ దాపిన హురుమంజిపాసలమెఱుఁగుకుచ్చు
లునిచి తీర్చినసొంపు మిసుకైనకెంపురా మొనముక్కు లూడెడు ముద్దుగులుకు
కళుకుఁ గ్రొంబని పచ్చచిలుకలు రహిమించు తొగరాచలువరాల నెగడు లోవ
తే. గలవగలనిండుపచ్చనిజిలుగుప్రతిమ, కతల నిరవొందు చిత్తర్వు కప్పురంపు
మెప్పు మేల్కట్లు చవికెలో మెఱయు హంస,తూఁగుతల్పమునఁ జేర్చితో యజాక్షి.

*   *   *   *   *

*   *   *   *   *

తే. తెలిసెనా నీకు హేమావతీలతాంగి
తెలియకుండినఁ జెప్పెదఁ దెలిసికొనుము
విభుఁ డటులఁ బిలిచిన విని విటుఁడు వడఁక
వెఱువకు మటంచు ధైర్యంబు గఱపి యపుడు. 112

చ. ముసుఁగిడి పండుకొమ్మనుచు మోహముతోడ వితర్దిఁ జూపి తా
నుసు రసు రంచు ఖిన్నయయి యొయ్యన నేగి కవాట మవ్వలన్
బెసబెసఁ ద్రోచి మూఁటఁ దలఁ బెట్టుక వచ్చినభర్త కింత సా
ధ్వస మొదవంగఁ జెప్ప విని వాఁడు విత్తాపిత యేమి యం చనెన్. 113

వ. అని హీనస్వరంబున. 114

క. అడిగినపతితో నిట్లను, దడవాయెను సుంకరీఁడు తమలెక్కలకై
పడియున్నాఁ డిదె కనుమని, పడఁతి యతనిఁ జూపఁ జూచి భయ ముప్పొంగన్.

క. వెను కడుగు లిడుచు నవ్వలఁ, దనపొరుగింటను విభుండు దాఁగినచో జా
రునిరతితృప్తాస్థన్ వే, తనిపి వెడల ననిపి తరుణి ధవునిం బిల్చెన్. 116

తే. పిలువ నతఁ డెప్పటట్లన ఖేదపడక, కూర్మితో నుండెఁ బతి దాను సుందరవదన
వింటివా యిట్టిచాతుర్యవిశదశక్తి, నీకుఁ గలిగినఁ బోవమ్మ నృపతి నెనయ. 117

చ. అని కలహంస చెప్పఁగ మహాదరణంబున నాలకించునం
తనె తపనోదయప్రభలు తద్దయుఁ గాన్పడఁ గేళికానికే
తనమున కేగి యచ్చట సుధాకరబింబనిభాస్య ప్రొద్దుగ్రుం
కినఁ దను కావియోగమునఁ గేవలమున్ వెతఁ జెంది యుండుటన్. 118

క. కుముదమ్ములు కుముదమ్ములు, సముదమ్ములు గాఁగ మెఱయు సాయం బైనన్
రమణీమణి ఘనరుచిభా, రమణీఘృణి సిరులు నిరులు రంజిలువేళన్. 119

సీ. తారకావృతపయోదముమాడ్కి సుమదామపరివృతం బగుకొప్పు పరిఢవిల్లఁ
దీఁగను ననలు హత్తినచందమున మేన సొగసుగా రతనంపుసొమ్ము లలర
పదనచంద్రునిగూడ వచ్చినరోహిణి ముఖువున ముత్తెంపుముక్కు రమర
మంచు గప్పినగట్ల సంచున వలిపెంపుఁ బైఁటలో గబ్బిగుబ్బలు చెలంగఁ
తే. బరఁగు జగడాలపగడాలభరణిలోనఁ, గ్రాలు మగరాలనిగరాలలీల విడెపు
టరుణరుచిఁ జిల్కు నోరఁ బల్వరుస మెఱయ, వచ్చినిల్చినయాహేమవతినిగాంచి.

క. జలజభవాశ్వం బిట్లనుఁ, జెలియా యింకొక్కగాథ చిత్రతరంబై
చెలు వొందెడిఁ జెప్పెద వినఁ, గలవే యని యడుగ వినెదఁ గాకని నిల్చెన్. 121

వ. హంసం బిట్లనియె. 122

---

## పదునేనవరాత్రికథ.

మ. ఇతరధ్యానము మాని నీవు వినుమీ హేమావతీ ద్రావిడ
క్షితిలోఁ జిత్రవిచిత్రవస్తువితతిన్ జెన్నారు కాంచీపురిన్
స్థితుఁడై కాఁపుర ముండు శూద్రుఁ డొకఁ డాశ్రీదృష్టికిం బాత్రమై
శ్రితనానాజనభాగధేయ మగుచున్ సీరాంకనామంబునన్. 123

సీ. ముంగిటఁ బుల్లిజాలాదములు గీచి యుండిన రచ్చబండలు గొప్పప్రహరిగోడ
పంచదిన్నెలు చాదుపట్టెలు ముష్టూల గూండ్లు దీర్చినయట్టిగోడ లలరు
దేవరచవికె పందిరి కోళ్లగూడులు గొఱ్ఱు గుంటుక కాడి క్రొత్తపల్లు
లట్టువగల గాడి కొట్టంబు పలుగడి కంపపాతినలేగ కదుపుదొడ్డి
తే. ప్రత్తిగూటంబు తొట్టియు బలకపీట, బావి సిడకలకుచ్చెల పసులమేపు
మంగలము దాలి ఱోలుల్కి మ్రానిసందు, గలిగి విలసిల్లు నాతనినిలయ మెపుడు.

వ. అదియునుంగాక మఱియును. 125

తే. ముద్దగిద్దజపులమార్పు ముసుకుపచ్చ, మార్పుజింకపురిపరంగి మల్లెమార్చు
పొల్పసరకొమ్ముసూగూరిపైరజిల్లి, మరపల్లెజొన్న లమ్మంగఁగలవు. 126

సీ. జడకొట్టి కొట్టులు చామలు వెలిచామ కుట్టారి కారిక కొండబరిగె
బరిగెసజ్జయు గిడగిరసజ్జ మజ్జపా ల్గిడ్డచే స్పద్దరాగెయును యవయు
గోధుమ పెసనువ్వు కుఱునువ్వు తెల్లనువ్వు కులును పెల్లగిసెయుం గోఁగుజనుము
చిటితోట వెలిపుద్దచెపరంగి పేరామిదము చక్కెర చిఱాముదమును మఱియుం

తే. మినుము వెరతెల్లకంది చిర్సెనగ సెనగ, పెచ్చనలపెచ్చ కుఱుపిల్లపెసరగాయ
మఱ్ఱు పలసంద లుబ్బడాల్ నల్లతెల్ల, యులవలు పటాణములు పుష్టికోలఁదిగలవు.

సీసమాలిక. బంగారుతీగెలు గంగాజలమ్ములు కస్తూరినిగరాలు కటకసరులు
నిప్పపూరాజనా లేనుంగుకొమ్ములు మల్లెశ్రీగంధులు మదనగంధు
లేత్రికరాజనా లీశ్వరప్రియములు రావిపూరాజనాల్ రత్నసరులు
కుసుమపూరాజనా ల్గుత్తిబల్గుత్తులు కస్తూరిపట్టెలు గంధసరులు
మంథిగంద్రలు నాగమల్లెలు తీఁగెమల్లెలు కృష్ణనీలాలు వెలువడాలు
మన్మథబాణాలు మరువంపుమొలకలు సన్నమణింగెలు జున్నుబ్రాలు
పొన్నశ్రీరాజనా ల్పునుఁగురాజనములు ముద్దుప్రాలారళ్ళు ముత్తుసరులు
సన్నసూదులు పచ్చగన్నేర్లు గోదండరాము ల్కేసర్లు రాయసర్లు
చంద్రవంకలు జీనిసరులు కాంభోజులు పంగాకు బోడములు పొంగుబ్రాలు
జిరకర రాజనా ల్చింతపువ్వులు గోరు రాజన లుబ్బదప్రోల్ రాజనాలు
రామబాణాలు రెక్కాములు వెన్నముద్దలు జిల్మ బుడమలు దాళవాలు
గొప్పకాయలు బలుగుత్తులు పాలమీఁగడలు శ్రీరంగాలు కామదార్లు
ఱెక్కపాలలు కాకిఱెక్కలు పుష్పమంజరులు సీతాభోగసరులు గొరి
కుంకుమల్ రణబెండ్లికొడుకులు పిచ్చుకగోళ్ళు ప్రయాగలు గొజ్జుఁబ్రాలు
గరుడసరు ల్పోతుగంటరాజనములు మోదుగతోడిమలు ముదుకసరులు
పచ్చసరుల్ రెడ్డిపాలవంకెలు సుఖభోగులు పచ్చకర్పూరసరులు
నివ్వరు ల్దెబ్బస ల్చీరుకావులు గాజుకప్పెర ల్కుఱుపడా ల్కంఠసరులు
సాలంక లలుగురాజనములు సంభావు లవసరదార్లు మోహనపుసరులు
మణిసరుల్మసరులు మంకెన ల్పగడంపుతీఁగెలు మడిప్రాలు దేవసరులు
లత్తుకబొత్తలు లక్ష్మీమనోహరా ల్భారతీసేసలు బాహుపురులు
వజ్రపుఁదళుకులు వాసనరాజనా ల్జవ్వాజిపంకెలు గవ్వసరులు
సంపంగిపూవన్నె జాజిరాజనములు గంబూరరాజనా ల్కన్నెసరులు
తుమ్మిపూరాజనా లమ్ముసుకొణిగెలు జీనువముక్కలు చిలుకముక్కు
లేదుకట్టులు వంకె లిసుకరాజనములు పులిగోళ్లవంకెలుఁ బొగడసరులు

తే. జిలితొగలరాజనమ్ములు నలవరులును, దెల్లనల్లచెన్నంగులు దీపసరులు
నాది యగుపేరు గలుగువడ్లతనియింట, నుండుశతకోటిపుట్టులొక్కొక్కదినుసు.

తే. దొండకాయ ములుకకాయ తొట్లకాయ, జంబికాయయు నెట్టిలసందకాయ
వెలయు నుస్తెకాయయు రామములుకకాయ, మేడికాయ కాకరకాయగూడ నింక.

సీ. శామగుమ్మడి యోంబరాజుగుమ్మడి చారగుమ్మడి బూడిదెగుమ్మడులును
గిండిసొఱయును దీఁగెకిన్నరసొఱయును బీఱ సముద్రపుబీఱ నేతి
బీఱ పిచ్చుకపొట్ల పొద్దపొ ట్లేనుఁగుదంతపు పొట్లు తంబలు వెలి
కాకర పొట్టికాకరలు మేఁకచెవి చిక్కుడు పాలగణపులగోరుచిక్కు

తే. డులు సుగంధాలు బొంతనంటులు సురఁటులు, గంజిపందిటికపురపొంకాయతరులు
బూజుపుచ్చ కురాసానిపుచ్చ పెద్ద,దోస నక్కదోసలు వానితోఁటఁగలవు. 130

ఆ. చేమ కంద గెనుసు చిఱిగోరు పెండ్లమ్ము, పొనఁగు తెల్లగెనుసు భూతగెనుసు
లల్ల ముల్లి పసపు ముల్లంగి వెల్లుల్లి, గాజరయును మొదలుగాఁగఁగలవు. 131

చ. గురుగెఱ బొద్ది చెంచలియుఁ గుచ్చలి చిట్టి తగిర్సి తుమ్మి దు
స్సరి బలుగూటిబొద్దినెలి చల్మిలి పల్లెరు దూకపాత్కె వె
ల్వరిగిసె ముస్గ వెల్ల చెవిపావిలి దొగ్గలి పొన్నగంటి దే
దరి నరపంజిచేత రసదాపయుం గొండలి కొండపిండియున్. 132

తే. పాల వామింట తక్కలి బచ్చలి కొయి, గూర చక్రవర్తము చిల్కకూర గోళి
కూరదుంప బచ్చలి తోఁటకూర కొతిమ, రాకుసోపు మెంతాకు చుక్కాకుగలదు.

సీ. పనస సీతాఫలా ల్చినిమ్మ గజనిమ్మ దూదినిమ్మయుఁ నార మాదిఫలము
నారదఖర్జూరనారికేళాదులు రామఫలంబులు జామఫలము
లలరారు బొంతకిత్తళియుఁ బోకయుఁ బోక పిప్పలి నేరేడు పెద్దవెలఁగ
రామావళియు గమరక జీడిమామిడి బారంగి పెనురేఁగు పాలఫలము

తే. చెట్లుపండెడితోఁటలు చిట్టు గొట్టు, చెఱకు రసదాళిచెఱ కెఱ్ఱచెఱకు నల్ల
చెఱకుతోఁటలు కలుజొడ్లు సీర్సి దినుసు, కారపా కాకుతోఁటలుగల వతనికి.

సీ. మామిడికాయయుం మారేడుగాయయుఁ గొండముక్కిడికాయ కొమ్మికాయ
గరగుకాయయు మొల్గకాయ యందుగుకాయ లుసిరికెకాయలు నుస్తికాయ
లేకరక్కాయ,యుం వాకల్మికాయయుఁ జిఱినెల్లికాయయుఁ జిల్లకాయ
కలబంద గజనిమ్మకాయ నార్దపుకాయ చిననిమ్మకాయయు జీడికాయ

తే. కొందనపుకొమ్ము మామెనకొమ్ము బుడమ, కాయ యల్లము మురియంపుకాయ బీఱ
కాయ కంబాలు కరివేఁపకాయ లాది, యైన యూరుఁగాయలు గల వతనియింట.

తే. పంట మోటాటి పెడగంటి పాకనాటి
యరవెలమలాదికొండారె మొఱసుగోన
కొణిదెకాఁపులు మొదలైన క్షోణిఁ దనరు
కాఁపులకు నెల్ల మిన్న యక్కాఁపుకొడుకు. 136

తే. అతనికొక్క కులాంగన యగ్రమహిషి, చనినపిమ్మట సత్యకేశిని యనేటి
పేరుగల్గినచిన్నాలు బిసరుహాస్త్రఁ, డేలుప్రియురాలు నాఁగ సొంపెక్కి క్రాలు.

సీ. మెఱుఁగంచుకమ్మలు మ్మెణ్ణాలు గెరలముక్కర యుద్దబుగడలు కట్లసరులు
దండిలీకైన చింతాకుతీఁగెయు నానుపల్లేరుబూవులు బన్నసరము
కుప్పెసౌరము మెచ్చికొన్నసూనలదండ యందగించినజోడు సందిదొంటె
నిగర మైనసిరాజపగడాలచేకట్లు కాంతికడెంబు లుంగరపుజోళ్లు

తే. గిలుగుమట్టెలు గెంటిలఁ గులుకు అవికె
సన్నమా వేయఁగన్నుల చలువచీర
పసిమిఁ జిల్కెడుముంజేతిపచ్చలమర
దుడ్డెతనమునఁ దిరుగాడు రెడ్డిసాని. 138

క. ఆచొక్కపుజిగి చల్లవ, లాచిక్కనిమెఱుఁగుటూరు లామోమందం
బాచక్కనిరూపముపస, చూచిన మరుడైన భ్రాంతి సొలయక యున్నే. 139

* * * * *

క. మినమినలీనెడు నునుమే, నునవొనరిన వనజనయననూతననలినా
నలమునఁ ననుపుగఁ గనుఁగొనఁ, దనరిన కనదనఘునఖనిదానసునాభిన్. 141

సీ. పలుకులు కప్రంపుఁబలుకుల వర్షించు చూపు మారునితూపు రూపుమాపుఁ
గరములు బిసఖేలికరములై సిరులొందు జడజగ్గు పిరులకు జడతనేయు
మందయానము హంసమందము నిరసించు మించుమైనిగ్గు భ్రమ్మించు నొంచుఁ
గుచములపస లాలికుచముల నిర్జించుఁ జెక్కిళ్లు ముకురాలఁ జెక్కివైచుఁ

తే. డాపికెమ్మోవి యమృతంబుబావికేవి
యూరు చెన్నారు చీమలబారు దూరు
నూరు లలరారు ననఁటుల సౌరు గేరుఁ
గాంత యగుఁ గాంతలతికాంతకుంతకంత. 142

క. కమలంబులఁ గమలంబులఁ, గమలాననలోచనముల కాంతి జయించుం
భ్రమదాళులఁ భ్రమదాళుల, రమణీమణివాలుఁజూపు రహి నిరసించున్. 143

తే. దానిబిగిగబ్బిసిబ్బెంపుఁ దళుకుటుబ్బు, గుబ్బచన్నులకౌఁగిలిఁ గోరనట్టి
మానవాగ్రణి వసుమతీస్థానములను, వెదకి చూచిన లేఁడు పో విద్రుమోష్ఠి.

తే. అది మనోజ్ఞము లైనయాహారములను, గండమెం డైనమదముచేఁ గన్నుఁగాన
కమితపల్లవరతికేళి కాస వొడమి, మిఱుచిత్తముతోడ నేకారఁ దొడఁగె. 145

సీ. పనివంటవార్పులబాధ లించుక లేక తీరిన మంచిసంసార మొదవె
నత్తమామలపోరు నారుదూ రెఱుఁగక పొం దొంద నిచ్చఁగాఁపురము దనరెఁ
గుడువఁ గట్టను బూయఁ దొడుగ వస్తువులు యథేచ్ఛముగా నుండునిల్లుదొరకెఁ
బట్టిపల్లార్చ కేపట్టున దయఁ జిల్క మనసు గల్గినయట్టిమగఁడు గలిగె

తే. నింతగల్గిన నేమి నాహృదయ మెఱిఁగి, మమత దీరను బదివేలమంది మగలఁ
గలుగఁజేయక చెడుదోసకారిబ్రహ్మ, యొకనిగాఁ జేసె ననుచు నూరక తపించు. 146

*   *   *   *   *

చ. ఆటువలెఁ జూచువేళ నొకఁ డంగదనాముఁ డాయుద్ధోపజీ
వటకుఁ బ్రయోజనార్థము రయంబున వచ్చిన వానిఁ బెక్కుచో
క్కటపుటొయార మారఁ గని కాఁపది మోహము నిల్వలేక మి
క్కుటపురతిప్రయత్నమునకుం గరఁగించెద నంచు నిట్లనున్. 147

తే. ఎన్నడును రానివాఁడ వీ వేమి పనికి, వచ్చినాఁడవు కూర్చుండు వన్నెకాఁడ
మంచ మదె తెచ్చి యింటిలోనుంచినా న,టన్న వినివాఁడు పోవలెననుచుఁ బలుక.

ఉ. పోవలెనంటివా రమణిమో మటుచూడక నీడ నుండ లే
వో విలపించుబిడ్డలకు నొయ్యనఁ జన్నిడి నిద్రఁ బుచ్చఁ బోఁ
గావలెనో భ్రమించు విటకత్తెలయల్కలు దీర్చఁబోయెదో
శ్రీవిభవోత్తమా యెఱుఁగఁ జెప్పు మటంచును జెక్కుపట్టుచున్. 150

*   *   *   *   *

వ. ఇత్తెఱంగున. 152

*   *   *   *   *

*   *   *   *   *

క. అలకాఁపువగల చిలుకల, కొలికికిఁ దమి యింతయైనఁ గోల్పడక మదం

బలరారి యుండ నొకనాఁ, డెలమిని నయ్యూరబేరి హిత మలరారన్. 155

చ. ముదుకరుమాలుగుడ్డ భుజమూలమునం గిడితంబుమీఁదఁ బ్రాఁ
తది యగుదుప్పటంబు మొలఁ ద్రాసును గీసరయుండు తిత్తి స
న్నది నెలవంకనామము వినాయకు నుంగర మంగుళంబునన్
బొదవఁగ రత్నగుప్తుఁడు సమున్నతి నింటికి రాఁ బ్రియంబునన్. 156

క. ఆసత్యకేళినీసతి, నాసత్యమాను వైశ్యనాయకురూపం
బాసఁ గొని చూచి మోహము, తో సరసము లాడుకొనుచుఁ దోషణ మొదవన్.

క. వక్కాకుఁ బోగా కిడు మని, చక్కటికిని బోయి పైఁట జాఱఁగ నెదుటన్
మొక్కనఁగ వొప్ప నిలఁబడి, దక్కితి విఁక నెందుఁ బోయెదవురా బావా.

* * * * *

ఉ. వచ్చితి రెడ్డిసాని తలవాఁకిలి దీయు మటంచుఁ బిల్వ లో
హెచ్చినసాధ్వసాప్తి నపు డెంతయుఁ వైశ్యుఁడు సంచలింపఁగా
నచ్చపలాక్షి వాని భయమందకు మం చొకగాదెలోపలం
జెచ్చెర నుంచి నాయకుని చెంతకుఁ జేరి మహానురాగయై. 160

* * * * *

క. ఆలకాఁపుసంపదల నల, రలకాఁపువధూటియానసాలంకృతి కా
ర్యలకాపుంజతయై వే, డ్కలఁ గాఁపుర మొప్పఁ జేయుకాలమునందున్. 162

ఉ. నల్లనికమ్మిపచ్చడము నామము బొట్టును గుచ్చుటద్దముల్
తెల్లరుమాలు వల్లె మొలఁ దిత్తి కరంబునఁ గోలవ్రేళ్ల సం
ధిల్లిన వంకుటుంగరము తీరగుపూజలజంటగుండ్లు రం
జిల్లఁగ వచ్చి రెడ్డి తనచెల్వగువాఁకిలి దీయఁ బిల్చినన్. 163

క. ఆయెడ నిద్దఱు మిండలఁ, బాయక రతిసల్పు కాఁపుపడఁతుక యెటులన్
మేయించి బొంకవలెఁ జెపు, మా యని చక్రాంగవంశమండన మనినన్. 164

ఉ. ఆవచనంబు వేడ్క విని యాదల యూఁచి నిడూర్పు పుచ్చి హే
మావతి పల్కె హంసవర మాటికి మాటికిఁ బృచ్ఛ యేల నీ

సీ. కాంభోజి కేదార గౌళ శోకవరాళి పున్నాగ గుమ్మకాంభోజి శంక
రాభరణము మేఘరంజి తోడి వరాళి నాదరామక్రియ నాట రీతి
గౌళ రామక్రియ మేళరామక్రియ గౌళ నారాయణగౌళ మధ్య
మావతియు ముఖారి మలహరి సామంత పంతువరాళియుం బౌళిరాగ

తే. చెంచు మలహరి దేవాక్షి శ్రీవరాళి, మాళవియుఁ బాండి సింధురామక్రియయును వ
సంత సామంత శుద్ధవసంత గుజ్జ, రియును హేజ్జుజ్జి నీలాంబరియును నసంగ. 124

తే. పొసఁగు ముప్పదిరెండు నపుంసకములు, మాళవశ్రీ యనంగను మలహరి యన
దేవమలహరి రేగుప్తి దిరముగుంద, మలహరన నైదుమిత్ర లీమర్మ మరసి. 125

తే. షడ్జ గాంధార మధ్య మర్షభ నిషాద
పంచమ సుధైవతాఖ్య సప్తస్వరములు
మంద్ర మధ్యమ తారకమహిమ లెఱిఁగి
యాడఁ బాడఁగ నేర్చు నయ్యబలఁ జూచి. 126

క. వలచి యతఁడు కడు మోహమున, దలమునుకలుగాఁగ మరునితాపాతివితతా
పులకకలికలకు లోఁబడి, మలయుచుఁ దావెంటఁ జాలిమాలం దిరుగున్. 127

వ. ఇట్లు దిరుగుచుఁ దాఁ జేయుయత్నంబులఁ దన కభిమతంబు ఘటియింపం దలంపని యారతిసేనను మరులుకొల్ప నూహించి యాపల్లవుండు వైద్యసహవాసం బొనర్చి యంత. 128

* * * * *

* * * * *

* * * * *

క. అనుచు నిజరచితవితరణ, జనితామోదమున వైద్యజనములు దెలుపన్
వనితావశ్యౌషధములు, విని యట్లొనరించి యంతి వెస నుంచితున్. 132

క. అని నిశ్చయించి యాబోటు, గనుపమమణిహేమఘటితమై సిరు లొలయన్
దనరు రతిసేనమందిర, మును గాఁపెట్టుకొని యుండు మోహము కల్మిన్. 133

సీ. పంచాంగమయ్యకుఁ బాగ సమర్పించు నట్టువకానికిఁ బెట్టు మురువు
భరతంపుటొజ్జకుఁ బచ్చడం బొగిఁ గప్పు బొగడుభట్టుకుఁ జేయు బోఁగుజోడు
కథఁ జెప్పు భూసురాగ్రణికి దోవతొసంగు నవువుకానికి బత్తె మెనయ నడుపుఁ
బూల్గట్టు సాతానిబోడి కుంగర మిచ్చు గందొడివానికి విందు సేయుఁ

తే. జతురికకుఁ జీర దూతికి సందిబొందె, కడెము పరిచారకకు సారికకును రవికె
తాపికకు సొమ్ము వైశ్యమాతకును గాన్క, లిచ్చి చెప్పించు రతిసేన కెచ్చుతమిని.

వ. మఱియును.

ఉ. గుండనికిం బసిండిపని గొరిడిబండకు వెండితాయతుల్
లండికిఁ జేకడెంబు పదిలంబుగ గుమ్మెతకాని కందెలుం
బెండెము బాసుగోలకు భృత్యునకు న్మెడనూలు చాటుకో
పండున కుంగరాలు మొలత్రాడులు గుంటెనకాని కియ్యఁగన్. 136

క. వారందఱు తమచాతురి, మీఱి మహాసంపదాప్తి మించినవాఁడీ
జారాగ్రణి యని చెప్పిన, నారతిసే నపుడు మంచి దని యియ్యకొనెన్. 137

క. పడఁతుక నతఁ డీగతిఁగొఁ, బడఁజేసుక ముఱిపె ముట్టిపడఁ గడుదమి దుం
దుడుకొనరింపఁగఁ గోరిక, లడరఁగ రతిసేన రతుల కాయత్తంబై. 138

క. పన్నీట జలక మొనరిచి, కస్నురి రానున్న మిన్న గన్నన్నకు ముగ్
మున్నొసఁగి సన్నబియ్యపు, టన్నము మితభుక్తి చేసి యమితోత్సుకుఁడై. 139

తే. చాదు శ్రీగంధ మరువ కేసరి కదంబ
మత్తరు పునుంగు జవ్వాది హారిణమదము
బుక్క యత్తరు గోవగంబూర బోలు
చట్ట కలపంబు పన్నీటఁ జాది పూసి. 140

క. సిగ నరవిరిసరములు పొం, దుగ వేసి రుమాలు గట్టి దుప్పటి వలెవా
టుగ వైచి విడెము సేయుచు, సొగ సుట్టిపడంగ నతఁడు సొంపు జనింపన్. 141

సీ. సకినెలపట్టెమంచము పాన్పు తలగడఁ బిళ్ళలు చందువ మట్టెవిరులు
కరడ సురటిగిండి గద్దె సున్నపుఁగాయ గాజుద్ద మదవము కలపము చిటి
చాప తబుకుసాన జాలవన్నిక దీపములు గందవడిపట్టె పుటఁగు బరణి
హాకుసంబెళతంబు రగురుధూపము పాదుకలు తమ్మపడిగము కప్పురంబు

తే. కోవికస్తూరివీణె కుంకుమసుమంబు, పొత్తములు రుద్రవీణె మేల్కట్లుభాగ
ములకపండంబు రతిబంధకలితచిత్ర, ములు గలుగు కేళినిలయ మిం పలరఁ జేరి.

తే. బలసి కోకిలు నొడ్డీలు పల్లటీలు, పావురాయీలు బకదార్లు బట్టిగాండ్రు
నంచలు నెమళ్ళు కేర్జము ల్పంచవన్నె, చిలుకలు సికాదిశకునము ల్గలసి పలుక. 143

తే. చంద్రకావి ఖురాళంబు సరిగెచెఱఁగు, జిలుగుకెందమ్మి దోదమ్మి చీనికమ్మి
పైఠిణీకమ్మి తెఱచాటుపాన్పుమీఁదఁ, బడటుతమి నుండునంత నప్పణ్యకాంత. 144

* * * * *

* * * * *

* * * * *

* * * * *

* * * * *

* * * * *

* * * * *

*    *    *    *    *

సీ. గంబూరమును జాజికాయ లుమ్మెత్తవిత్తులు మర్లు మాతంగి కలువగడ్డ
పచ్చయిన్నులు కోష్టు పచ్చిక మంచేనుఁ గమదము గుల్లసున్నమును రుద్ర
జడవేరు వస ఖురాసానివామము పుడుకలపోలుగాడు మైగారుచెమట
నీ రావుగజ్జలచేరినమష్టును గాల్మడి తాతంటుగాను నూరి
తే. కలయ గురిగింజలం తేసి గుళిక లమరఁ, జేసి నీడనె యారించి తీసి దాచి
యున్నవాఁ డింతమందుపుత్తో నొసఁగె నతని,కధికతర మోహమూన నాహంసయాన. 152

క. ఈబాళిమందు మసగొని, యాబిడ తనకండ్లు గట్టినట్లుండ నతం
డేబుద్ధిలేక నచ్చెలి, సోబెల కెదఁ జిక్కి చిక్కి చొక్కుచుఁ దిరుగున్. 153

తే. వాఁ డయుల మీఱి భోగమువారిఁ గేరి
చేరి రతిసేన రతిరాసఁ జెలఁగు మదిని
దాసిసాష్టైన యష్టైన దష్టమైన
వయసు మరుబారిఁ బడఁజేయుఁ వాసిజాయ. 154

సీ. బొమ్మలపెండ్లిండ్లు బువ్వఁపుబంతులు పుణికిళ్ళు నిట్టుక్కి బొమ్మరిండ్లు
గుజగుజరేకులు గొబ్బిళ్ళ నీగాగే బుడిగిన్ను జాబిల్లి పుక్కటిల్లు
గుజ్జెనగూండ్లు కోలుకోలన్నలు గీరనగింజలు పారుపట్లు
చిప్పిళ్ళు త్రొక్కుళ్ళు చేడిసెతిరుగుళ్లు నచ్చనగండ్లు దాగిమూతలు పాళ్ళు
తే. లడరు వామనగుంట లాదైనదట్టి, యాటపాటలఁ బ్రొద్దుపో నమ్మఁగుఁ జెలులఁ
బాయకచరించు బాలకిప్రాయ మేల, వచ్చె విరహాగ్ని యిటులేల హెచ్చె ననుచు. 155

*    *    *    *    *

*    *    *    *    *

*     *     *     *     *

వ. అంత సంక్రాంత వేళాలోక్యవాసరంబున.

చ. అటువలె వేగుచుండి మగఁ డత్తయు మామయు నింటలేమి పె
ల్పటికి హుసారునం జని గుబాటెబవీధులవెంట జంటలై
చిటిలినఫ్రాఁతగంధముల సిస్తుగుపాగల నిండుచల్వదు
ప్పటుల విభూషణావళుల బాగుగ నేగెడు దండెకాండ్రలోన్. 160

సీ. పసిఁడికుప్పెలకోవి పొరునుచ్చులు నింద్రగోపంపుజగజంపుగుంపువారి
కుచ్చుకుళ్ళా సిగ్గెము గ్లోల్సెల్లు మునవాఘు చెక్కడపుంబచ్చబిలుకచెప్పు
పట్టుపట్టంచుతాప్తాలేపు జీవదంతపుగోడియలు పట్టుత్రాళ్ళ విండ్లు
నేనుంగుకొమ్ము కాటేరికిఁ జేటాకు విరికెలమ్ములు సెల్లు వెండవీటి
తే. కేను లీవంగి సోఁక పొక్కిలులపోలు, పుప్పిచిమతిండియును లేఁతముందునిసుద
గణపుసదులాపుసీలరక్తములపన్ని, కొమ్ముపున్నాగ మమరం దలమ్ములందు. 161

క. వగ లుట్టిపడఁగఁ దమతమ, సొగసులతో నిట్టవీఁగు సొంపుల మీసాల్
వగలున వడిప్రేయుచుఁ జెఱు, నగవులఁ బవ మనుచు జారనాయకు లలరన్. 162

సీ. పైచరమోరడిబలిమికం బొద్దిక ముల్లడితాపుసు జల్లికట్టు
మైసళ్ళ మెడగుసు మారువెంబడిబిట్టు జతుకు సమాధానజనన మదుగు
లోదాటు నడ్డకాలువపాపబెళకునిబ్బరము నిరడికంధు బసిమిదివుగు
నుమ్మలి సెలవు పాదొత్తుకలు ధుతాళి తోడిగట్టయుఁ గాఁజముపులావు
తే. హొయలు బూరుగ వన్నాగవహొయలు బిగువు, బొట్టు దేగుపరేకప్పు బెట్టడిసుము
పటమ తాకుసు మొగవాయల్పదిలమదిగొ, హెచ్చరికటంచు పడిపోయ లేగుచుండ.

ఉ. సంచపురేకు దుప్పటులు జారుసిగ ల్బిగిచల్లడాలు వా
సించెడిగంధపట్టియలు బిల్లురుమాలలు సందితాయెతు
ల్మించుగ సానచిమ్మునునుమీసలు దీటుచు మీఁటి కేలఁ ధి
క్కెంచు వటంచు గుంపుగొని కేకలు వేయుచు వచ్చువారిలోన్. 164

తే. మంతుఁ దన నొప్పు నెరవింత హొంతకారి,సొగసుభోయకాఁజానయుఁజూచిదగ్గ
రికరించిన నాతఁడు కెరలి కాంచి, యిదియు వగలాడిరా యని కదియఁ జనఁగ.

ఉ. గేదఁగిరేకుటత్తమునఁ గీల్కొనుచూతదళంబు నాళ మిం
పూఁదినజాజిమొగ్గ గజ ముత్యలపుఞ్ జలికట్టు సంపఁగిం

బాదరుగా నొనర్చినయ పాకిని బుష్పాడి మందు కప్రపుం
బూదియగుంపు నుంచి మరుబోయెడ మాయన సేసె నిర్వరన్. 166

వ. అప్పు డామంతుఁ డయ్యింతిచెంతకు సంతసంబున వచ్చుచు నిజాంతర్గంబున. 167

ఉ. ఆరయ నేఁటిటియసలందుల వెన్నెల తేటనించి తో
ల్కారు మెఱుంగురంగు వడి కమ్మసుధ న్వద నిచ్చి మేటిశృం
గారరసంబుతోడఁ బొసఁగంగ నొనంగ విధాత చేసెఁ గా
కీరమణి స్విధాత సృజింపంచుచు నంటెనఁ గంద కుందునే. 168

సీ. దీర్ఘమై విలసిల్లుఁ జేటవాల్గనుదోయి గుదుసైన నాభియుఁ గుల్కుచుండుఁ
గ్రొమ్మించుగతిహొచ్చుఁ గొమెరచేతులరీతు, లుత్వంబుచందాన నొప్పు జఘన
మాత్వంబుభాతిని నమరుఁ గర్ణద్వయం బేత్వమై జడపొంక మెసఁగుచుండు
నైత్వంబువిధమున నలయూరు లలరాఁ దలకట్టువలెమించుఁ దళుకునొసలు

తే. పున్న నవుము నిసర్గలు చన్ను లారు, పొసఁగు వలపలిగిలక యాభుజము లనఁగ
నలరు గుణితంబుపైఁ బూనఁ జెలఁగు నంగ, సౌష్ఠవముతోడ నున్నది సకియ యనుచు.

వ. కదియం జేరి యిప్పుడు. 170

చ. చెలియరొ యొప్పుదం బెటనుఁ జేరఁగ వచ్చిట నిల్చినావు వీ
రెలనివ మొప్పు వగ్గతివి నెమ్మదిలోఁ గలపూసిక దెల్పు మా
యలు పచరింపఁ బో కనిన నమ్మక చెల్లరొ యాతఁ డెందు కెం
దులకురు పగ్గ సేచి కమదొమ్మికి రాఁ దలఁచెక్ సెబాసుపో. 171

తే. అనుచుఁ జెలునవ్వ మోముపై నంకురింప, భయము సిగ్గును దనుముంపఁ బలుకు నెడల
గద్గదరసంబు జనియింపఁ గన్నెదాన, మేలు పడినాను జాణ నన్నేలుకొనర. 172

క. అనినవిని వుంచి దని యొ, క్కసివాసస్థలముఁ జేరఁగా రమ్మని వ
చ్చినఁ జేరి ముద్దుపడి నెం, ల్లనఁ జేష్టల నుబుసుపుచ్చి లాలిత్యమునన్. 173

* * * * *

* * * * *

* * * * *

ఆ. అత్తకన్నతోడ లయ్యత్త తోడలి, కన్న నేపు శేఁగి యాత్తజార
జనులఁ గూడి పొంది దగిలింప సాఁగిరి, యొంటిపాటు దొరకి యున్న యెడల. 177

తే. అత్త యేమఱి యుండెడు నంతలోనఁ, గోడలు చరించి వచ్చును గొంతదడవు
కలయఁగ గుణాలు వచ్చునాక్షణమె బుద్ధి,కోడలికిఁ జెప్పి యత్త రంకాడఁబోవు.

క. ఈమాడ్కిని నన్యోన్యం, బేమాత్రము తెలియకుండనిచ్ఛాప్రవృత్తిన్
గామించుచు నొకదినమున, లేమాపునఁ గోడ లింట లేకుండునెడన్. 179

క. వలవనిసతిపురుషులకును, వలపులు పుట్టించు మందు వగ నెఱిఁగి రతిన్
వలపులు మరుపం జాలిన, బలియుం డగు హొంతకారి పథమున రాఁగన్. 180

ఉ. అత్తయు హొంతకారిని రయంబునఁ దోడ్కొని మూలయింటిలో
హత్తుకకేళి సల్పునెడ నంతటఁ గోడలు వచ్చి యింట మా
మత్త విభుండు లేరనుచు మంతునిఁ దోడ్కొని యిల్లు చేరినన్
దత్తర మారఁ గోడలిని దద్విటునిం గని యత్త కిన్కతోన్. 181

తే. అపుడు గృహమధ్యముననుండు నత్త నంత,విటునిఁ గోడలు గాంచె నవ్వేళయందు
నేర మొక్కింత రాకుండ నేర్పు మెఱసి, వారలిరువురుబొంకఁగాఁ బలయుఁ జెపుమ.

క. అనవిని హేమావతియు, యను వమరఁగ నితరశంక లందక యుండన్
ఘనకచలు బొంకి తమవిట, జనములనిల్వెడల నంపఁ జాలిరొ యెఱుఁగన్. 183

క. నీ వెఱిఁగించిన వినియెద, నా విని హేమావతీ కరం గడు వేడ్కన్
భావమున నున్న విను మని, ధీవిభవను హంసవంశతిలకం బలికెన్. 184

తే. అటుల విటయుక్తయై యింటి కరుగుదెంచు, కోడలినిజూచి యత్తసక్రోధయగుచు
వీఁ డెవఁడు వీనిఁ దోడ్కొని వేశ్మమునకు, సంకడ రాఁ బనేమని జడియ నడుగ.

క. దిటచెడక దిగులుగొని సట, పొట లోపక వెనుకముందుఁ జూడక బొంకే
దెటు లని చింతింపక యా, ఘటకుచ తడఁబడక యత్తఁ గన్గొని పల్కెన్. 186

తే. తల్లిదండ్రులు మీరు బాంధవులు మఱియుఁ, జిక్కి తక్కినవారలు చెప్పినపుడు
వినక నాపతి నన్నిట్లు విడిచిపెట్టి, తిరుగుచున్నది మీకెల్లఁ దేటగాదె. 187

క. వనితాపురుషుల కీయన, యనువున నన్యోన్యమోహ మలరఁగఁ జేయన్
ఘనుఁ డని కొందఱు చెప్పఁగ, విని తోడ్కొని తెచ్చినాను విభు నను గూర్పన్.

క. ఇది యేక్రియ నీయనచే, ముదమునఁ జేయింపవలెనొ ముగ్ధను బ్రాయం
బొదవినదానను మోహము, మది సైఁపఁగఁ జాల ననుచు మమతఘటిల్లన్. 189

ఉ. కోడలుపల్కుపల్కు విని కొంకక నిక్కముగాఁ దలంచి యా
చేడియ నాదుజారుఁ గని చిత్తములో నెటులం దలంచునో
మూఁడెల నమ్మరా దని విభుంతుదవేణి తనందు సత్యపుం
జాడఁ గనంబడన్ స్వతనుజాతలతాంగిని జూచి యిట్లనున్. 190

## పందొమ్మిదవ రాత్రి కథ.

క. శ్రీకర మను నొకపురము సు, ధాకరబింబభ్రమప్రదస్వర్ణమణి
ప్రాకారగోపురవర, ప్రాకారసువజ్రకలశమై సిరు లొందున్. 201

శా. సాలాగ్రస్థలకేళితత్పరమహీస్వామ్యర్భకవ్యూహదోః
పాళీక్రీడితరత్నకందుకమహాబాహ్యప్రణావాప్తిచే
నాళీక ప్రియ ధీరసారథికి ము న్బాటిల్లి యీనాఁటికిన్
బోలేదయ్యె ననూరునామమదివో మూలంబు తత్సంజ్ఞకున్. 202

మ. పరిఘాంభఃపరిదృశ్యమానవిలసత్ప్రాతాళసంచారబం
ధురదర్పోత్కరభోగరత్నఘృణిసందోహంబు కెంపమ్మె మొ
గ్గరమిన్ గుల్క హరింపఁబూని యది రాకన్ నక్కినన్ బల్మఱిన్
గరముల్ సాఁచఁగ బోండ్లు నవ్వుదురు వీఁకన్ వారికేళిన్ సతుల్. 203

తే. ఆపురంబున ఫణిహారుఁ డనెడు పేరఁ, గాఁపురము చేయుఁ నొకతిలఘాతకుండు
సంభ్రమంబున నాకారసౌష్ఠవమున, వాఁడు కందర్పునకుఁ జీటి వ్రాయఁగలఁడు.

తే. గానిగెకడెంబు మోకులుగడ్డపార, కాడిసిద్దెలు గూటంబు కడవ జల్లి
గంప కనుగంత తక్కడి గట్టియెద్దు, చుట్టుచవికెయు సర్వవస్తువులు దనరు. 205

తే. వెల్లగిసెనూనె కుసుమనూనె వెట్టినూనె, నల్లనూ నిప్పనూనెయుఁ దెల్లనూనె
కుసుమగానుగ దుంపగ కొబ్బెరయును, నూనె పొగనూనెతగిరెసనూనెమఱియు.

క. పరిపాటికల్మి చేతను, గరగరిక వహించి యింది కడునాగరిక
స్ఫురణం దమవంశంబున, కరయంగాఁ బిన్నపెద్దయై యతఁ డుండున్. 207

చ. అతనికి నొక్కయింతిగల దంగజుపట్టపుదంతి జాతిణీ
సతులకు మేలుబంతి విటజాలము లాడెడుపూలబంతి యా
యతమతి జారచిత్తజమహావిరహాగ్నికి శాంతిదేహని
ర్జితచపలాసుకాంతి మణిచిత్రిణి నాఁ దనరారుఁ బేరునన్. 208

నిరోష్ఠ్యకందము. దరగళఘనరసధరకచ, ధరసదృశస్తన సుహాసన తరళనయన సుం
దరకంఠకతుకరయుగ, సరసనయన యనఁగఁ దనరె నాసతి దనరున్. 209

సీ. నీలధారాధరనిర్మలకాంతుల గడియలో మాయించుఁ గలికివేణి
సంపూర్ణపూర్ణిమాచంద్రబింబస్ఫూర్తి దినము తుంపఁగఁ జేయుఁ దెలివ ముఖము
నిద్దంపురుచు లొల్కు నద్దమ్ము లీక్షించి గవిసెనల్ పెట్టించు కాంతచెక్కు
లలరారు జిగిదేఱునలచకోరంబులఁ బుట్టుగుడ్డనిసల్పుఁ బొలఁతికనులు

తే. నెట్టుకొని గట్టు వగపట్టుపుట్ట చెండ్లఁ, బట్టి కొట్టించు వీఁపునఁ గొట్టుఁ బాఱఁ
గొమిరెసిబ్బెంపుగబ్బిచన్గుబ్బదోయి, వినుముదారంభగంభీరవేదిగమన. 210

క. తనుకాంతి మెఱుఁగుమిసుకా, మినుకావర మణఁచుఁ గొను మేలిమి గనకా
కనకాద్రితోడ సరి చనుఁ, జనుకాఠిన్యమ్ము పొగడ సన్మణితునకా. 211

తే. నీరజేక్షణసిబ్బెంపునిబ్బరంపు, గబ్బిగుబ్బల నెఱరూపు గాంచి తొడరు
కాంతిఁ బొంగారు బంగారుకలశములను, గనలు బిబ్బోక నీరాక గలుగఁజేసి.

మ. వనజాతాక్షిపయోధరంబు లలకవ్రాతంబు కంఠంబు మో
హనలీలం దగు ఫాలభాగమును నూగారున్ నవల్లీలచే
ఘననీలాబ్జకళాకలాపజయకాంతిన్ మించుచే యభ్రముల్
ఘననీలాబ్జకళాకలాపజయకాంతిన్ వేశి రాణించఁగన్. 213

ఆ. దానిజవ్వనంబు దనువు నిరీక్షింప, మానికైన నెనయ మనసు పుట్టు
నితరజనులు చూచి యేణాక్షిరతిఁ జెంద, నిచ్ఛయింతు రనుట కేమి యరుదు. 214

తే. త్రుప్పుడుల్లిన నొప్పారుతోయజాస్త్రు, చికిలినిద్దంపుఁగైదువు చెలువు తోఁప
నూనె మెఱుఁగున నునుచాయ మేను దనర, నది విటాళుల కన్నాసయై మెలంగు.

చ. నడవడిగల్గువాఁడు కడునాణెముచేఁ గలవాఁడు రూపునన్
బెడఁ గగువాఁడు బల్రతుల చేరజమై తగువాఁడు నిద్ధరన్
జెడుఁ గల బ్రహ్మ దీనిని నిసీ మగవాలుగఁ జేసె నంచు లో
మిడుకుచు దానియింటికడ మీసలు దీటుచు నుందు రెప్పుడున్. 216

సీ. పనిలేనిపని పూనుకొని వచ్చి ముంగిటి నెళవుగఁ దిరుగనినీటుకాఁడు
వేఱొక్కకడ కేగు వేళల నటుతొంగి చూచి పోఁదలఁపని సొగసుకాఁడు
సంగడికాఁ డిందుఁ జనుదెంచెనా యని వాకిలిద్రొక్కనివన్నెకాఁడు
గానుక యీప్రొద్దు కట్టలేదా యంచుఁ గూర్చి యింటికి రాని కోడెకాఁడు
తే. మందునకు నైనఁ బ్రాయంపుమనుజులందు, వెదకి చూచిన నొకఁడైన వీటిలోనఁ
గలుగఁ డటువంటిమహిమ గల్గంగ దాని, కేమి జనవశ్యమున్నదో యెఱుఁగ రాదు.

* * * * *

తే. ప్రేమఁ గన్పట్టి వీథిలో బెళుకువగల, నరసి కనుసైగ చేసెడి యంద మంత
లోనె లోఁబడఁ జేయంగఁ జాననేర్పు, దానికే కాక కలుగ దేచానకైన. 219

తే. ఇరుగుపొరు గింత వినకుండ నింటిమగఁడు, తెలియకుండఁగ బరరతిఁ దేలి నంగ
సాచినలె నుండుఁగాని యానాతిగుట్టు, బ్రహ్మదేవున కైనను బయలుపడదు. 220

వ. వెండియు నయ్యండజయాన విటకాండంబులఁగూడి యఖండమోహంబునఁ బలు
తెఱంగులఁ జరింపుచుండె నివ్విధంబున. 221

ఉ. అంత వసంతవేళఁ జెలు వంతట నెంతయు సంతసిల్లె న
త్యంతలతాంతకుంతదళపత్త్రనిశాంతదురంతతాంతతా
శాంతికరంబు కంతుశరసంతతసంతతికాంతతాసమా
క్రాంతవనాంతరంబు కలికాతతిదంతురితద్రుమాంతమై. 222

తే. కలయఁ గొమ్మలతోఁ గూడి కాననమున, నుండు విటపుల ననిలచోరుండు పట్టు
కొని దళాంబరముల దోఁచుకొనియె ననఁగఁ, బండుటాకులు గాడ్పులు పర్వ రాలె.

క. వనలక్ష్మీమాధవశో, భన మగు నత్తఱిని బాదపలతాపురుషాం
గన లన్యోన్యముఁ గ్రీడిం, చిన నెఱయ వసంత మనఁగఁ జివురులు మొలిచెన్.

చ. వనకమలారుణాంబర మవారితకుంజపికౌఘశోణలో
చనఘృణిమండలంబు తరుసంఘదిగంబరపంక్తిమస్తకో
కనదభసజ్జపావృతము కాననమేఘతటిల్లతోత్కరం
బనఁగ నవీనపల్లవచయంబు రహించె నరణ్యభూములన్. 225

చ. అళితతి దక్కయెల్ల కుసుమావళి చుక్కలనామ ముల్లస
త్కళికలు ప్రాసపేరు నన దట్టము పట్టుగఁ బూని మావిజా
జాలకు శుభాశుభాలు పికసూక్తులఁ దెల్పుచుఁ జైత్రకుండనే
యల బుడబుక్కవాఁడు కలయం జరియించె వనాలయంబునన్. 226

చ. అళికుల గానవైభవము హర్ష మొనర్పఁ బరాగపూగము
ల్చలువపుతావిగందవడి సమ్మద మానఁగఁ గల్కిచిల్కప
ల్కులు నలరింపఁ గ్రొత్తవిరిగుత్తిచనుంగవ లింపు నింపఁ బో
ల్పలరు లతాలతాంగులను బాయుట లెట్లగుఁ బల్లవాళికిన్. 227

ఉ. చారుతరాతపత్త్రములు చామరము ల్సురటీలు పావడ
ల్సారసరోత్తరీయములు చల్వపువల్వపుదుప్పటంబు లిం
పారు సుగంధలేపనము లందముఁ జెందువితానఁ బంక్తులై
మీఱె వసీరమాసతికి మెల్లనిగాడ్పుల రేఁగుపుప్పొడుల్. 228

వ. ఇత్తెఱంగున జగన్మోహనం బైనవసంతసమయంబున నవనీసురు లగ్నిష్టోమంబును షోడ
శాప్తోర్యామంబు ద్వాదశాహస్సు వాజపేయంబు పౌండరీకం బతిరాత్త్రంబు చయ్యు

నంబు గరుడచయనంబు శ్యేనచయనం బశ్వమేధంబు గవాలంభనంబు ప్రతిపస్తో
మంబు మహావ్రతంబు విశ్వజిత్తు రాజసూయంబు సర్వతోముఖి విశ్వతోముఖి సత్ర
యాగంబుబృహస్పతిసవనంబుప్రాతస్సవనంబు మాధ్యందినంబు సౌత్రామియు నాగ్నే
యం బుమస్యం బశ్విసంబుహేమంతప్రచ్యవరోహణంబు వృషభయజ్ఞంబును మొద
లగు సకలక్రతువు లొనరింపం దొడంగి రట్టిసమయంబున. 229

క. హరిశర్మ యనెడుపేరునఁ, బరఁగిన యొకసోమయాజి పనిచిన నొకభూ
సురసుతుఁ డొకదిక్కున న, ధ్వరపశువును బట్టుకొని ముదంబున రాఁగన్. 230

క. కంతువసంతజయంతులఁ, బంతంబునఁ గెల్చు నతని భవ్యాకృతి న
త్యంతముదంబునఁ గన్గొని, కంతుశరాహతుల కళికి గాఁగుచు నాత్మన్. 231

చ. కలికిచొకాటపుఁ సొగసుకాయము కాయజుఁ గేరి మీఱు నీ
కలికివయోవిలాసువిగికొఁగిట సౌఖ్యదు నుండలేని యా
కులుకులయారగబ్బినసగుఁటిమిటారుల యంద మేల యె
మ్మెలపసమేల యం చతనిమీఁదను గాంత దృఢానురాగయై. 232

ఉ. చెంతకుఁ జేర నేగి ముఖసీమ దరస్మితమొప్ప వారసీ
మంతిని కీయనో వెలకు మార్చనొ యేటికిఁ గొంచుఁ బోయె ద
త్యంతరమైన భాగము నటంచును మాటలు దీసి పల్కి న
శ్రాంతముదంబుఁ గైకొని ధరాసురసూనుఁడు విచ్చఁగన్నులన్. 233

మ. అనవద్యాకృతి యౌవనంబు దగు నయ్యబ్జాక్షి వీక్షించి హా
వనజాతాసనుసృష్టికౌశలము శేషక్ దీని నిర్మించినం
తనె కానంబడె నేర్ప రా ననుచుఁ దద్వాణీశుఁ గీర్తించి మె
ల్లనె చేరం జని దానిచెంగటను మేలం బాడుచుఁ నిల్చినన్. 234

తే. అలరుకన్నులఁ దేలించి హర్ష మొదవ, సరస మాడుచుఁ గనుసైగ నెఱపి వేగ
నింటి కేగిన నచ్చెలి వెంట నేగి, క్రతుపశువు నాతఁ డొకచోటఁ గట్టివైచి. 235

వ. అప్పుడు. 236

* * * * *

ఆ. దానివిభుఁడు వచ్చి తలుపుఁదీయు మటంచుఁ, దనదుసతిని బిల్వ విని విటుండు
కడుభయంబు వొడమఁ గంపితదేహుఁడై, యింక నెట్టు లనుచు నింతి కనియె.

ఉ. అత్తఱి నెట్లు బొంకి వసుధామరశేఖరుఁ డైన యాభుజం
గోత్తము వెళ్ల నంపవలె నుత్పలగంధసుగంధి లెస్సఁగాఁ

చిత్తములోన యోజనలు చేసుక తెల్పు మటన్న హంసతో
బిత్తరి నే నెఱుంగ నిది పెంపుగ నీవు వచింపు నావుడున్. 239

క. మంచి దిది విను మటంచున్, గాంచనగర్భాశ్వ సుబలఁ గనుఁగొని పలికెన్
బ్రాంచన్మనోరసుధారస, చంచన్మకరందబృందసదృశమృదూక్తిన్. 240

ఆ. లలన నటుల భర్త పిలిచినఁ దా విని, వసుమతీసురుండు వడఁకుచుండ
వెలివవల దటంచు వీఁపు దట్టి లతాంగి, వేగ మేకపోఁతు విడిచిపెట్టె. 241

తే. పొదువు పోసికపట్టును భూమిదేవ, వర్య యనుకొంచు వచ్చి కవాటము గడె
యొడపినంతనె తద్భర్త యింతితోడ, నెవ్వఁ డీతండు గజిబిజి యేమి యనుచు.

చ. గదిమిన నావధూటి కలగన్ బడ కాత్మభయంబు లేక భూ
మిదివిజుఁ డీతఁ డీసవన మేషముఁ బట్టుకపోవఁ ద్రాడు వే
వదలిన వేగ వచ్చి మరవాసముఁ జొచ్చుక చిక్కఁడుండినన్
బదపడి తల్పు మూసికొనఁ బల్మరు మేషము ద్రిప్పఁ బాడెడిన్. 243

క. మూఁడు మని చూపి పాపినఁ, బోఁడు కసు స్వగ్మేకపోఁతునుఁ బట్టి
మ్మేడకుఁ బోవలెనో యని, చేడియ చెప్పిన నతండు చిఱునవ్వొలయన్. 244

తే. తరుమి మేషంబు పట్టిచ్చి తరలు మయ్య
బ్రాహ్మణోత్తమ యని పంపి భార్యమీఁద
సందియము లేక యెప్పటిచందమునను
వేడ్క లిగురొత్తఁగా నుండె వెలఁదిమగఁడు. 245

క. ఈమర్యాదఁ జరింపం, గా మహిమ యొకింత నీకుఁ గన్గిన భూమి
స్వామినిఁ జేరఁగఁ బొమ్మని, హేమావతితో మరాళ మిట్లను వేళన్. 246

సీ. కృకవాకుకంఠకీచకనివృత్తకదంబకములకుఁ బడమటికడమరుత్తు
బహుళనిద్రాముద్రపద్మకాననపద్మభవనను మేల్కొల్పు పాఠకుండు
చక్రవాకద్వంద్వసంబంధసంధానశేముషీభూషణచేటకుండు
సురమార్గదీర్ఘికాంతరతీరబిసఖండభక్షణాయాతపలక్షపక్షి

తే. భూరికైరవవనరమాముఖవివర్ణ, భాజనంపత్కరం బైన పగలువత్తి
కులటలెదఁ ద్రుక్కఁ జోరులు గుట్టలెక్క, వేగ జనియించె జిగినిక్క వేఁగుచుక్క.

చ. అపుడు కథాచమత్కృతికి నద్భుతయై తలఁ ద్రిప్పి యద్దిరా
నిపుణత దద్ద మెచ్చఁగల నేర్పరి వౌ దని పక్కి యంతఁ న
చ్చపలమృగాక్షి దివ్యమణిసౌధములో విరిదమ్మిపాన్పుపై
విపులన్నపాలమోహపరివేదనచే శయనించెఁ బొక్కుచున్. 248

ప. ఇట్లు శయనించి కొంతదడవు నిద్రించి హేమావతి రాజదూతి యగుహేలతో
ముదంబున నిట్లనియె. 249

చ. కలయొక టేను గంటిఁ గలకంఠసుకంఠిశుకాశ్వకేళికా
కలితకళాకలాపపతిగాఢభుజాపరిరంభణక్రియా
సలలితపారవశ్యసుఖసంభ్రమగుంభనజృంభమాణపుం
గల నల మేలుకొంటి రవిఁగంటి నకుంతతరోదయోపరిన్. 250

ప. అనిన హేమావతిం గాంచి నీయిష్టంబు శీఘ్రంబునన యీడేరు నని దూతి చెప్పిన
విని సంతోషించి యమ్మగువ క్రమ్మర దినాంతంబున. 251

తే. నీల కాకోలకాకోల నీలనీల, కంఠ శ్రీకంఠ శ్రీకంఠ ఘనఘనాఘ
ఘనఘనాఘ ఘటాఘట ఘటనరుచుల, పెంపు గనిపించుచీఁకటి పేర్చువేళ. 252

క. నలుగిడి కుంకుమపిండెసి, దల సంపెఁగనూనె నంటి తావులగంధా
మలక మొసఁగి పన్నీటన్, జలకం బొనరించి చల్వఁ దడి యొత్తి వెసన్. 253

సీ. చీనికలంకారి చీటికుచ్చులమీఁద సిరిమించుసరిగంచుచీరఁగట్టి
కొదమరాచిల్కలఁ గూర్చి తీర్చినసీమ సవుతుమేల్పనిచల్వరవికెఁ దొడిగి
తళుకుమానికపునిద్దాచెక్కడపుఁబైఁడిసొమ్ములు నెమ్మేన నెమ్మిఁదాల్చి
కమ్మనెత్తావి చొకాటంపుఁగలపంబు నెఱినీటుగా మెడనిండఁ బూసి

తే. తుఱుములోపల నరవిరిసరులు దుఱిమి, వేడ్కఁ గపురపుబాగాలు వేసికొనుచుఁ
గులుకుజిగిబిగివగ వింతగొలుపవచ్చె, బోఁటి లావణ్యమదనవధూటిఁ బోలి. 254

క. వచ్చి తనమ్రోల నిలిచిన, యచ్చపలమృగాక్షిఁ జూచి హంసము భళి ని
న్నెచ్చెలి నీసొగసునకున్, మెచ్చుము కథ విని యటంచు మెలఁతకు ననియెన్.

---

## ఇరువదవరాత్రికథ.

క. ఉజ్జయిని యనఁగ నొకపుర, మిజ్జగతిఁ బ్రసిద్ధికెక్కి సిద్ధవిభాసం
పజ్జలజరాగహర్మ్యరుచ, రజ్జారాలింగితాప్సరఃస్త్రీగణమై. 256

మ. నెలతాలోపలుచిల్కపల్కపనివన్నె ల్వన్నుముత్తెంపుఁదా
పలకప్రంపుటనంటిమొగ్గమగఱాబల్చోదిదంతంపుసి
స్తులు గుల్కం బవడంపుఁజాపులు రహించున్ గెంపుటారోడుబి
ళ్లల నిద్దం బగు నిల్వుటద్దములమేడ ల్వేనవే లప్పురిన్. 257

చ. పురవనభూజపుష్పఫలముల్ గొనువేడుకఁ బూని తద్రుమో
త్కరములఘోఁది కెక్కి సతతంబును దండల నుండు నందన

తే. పెంచియెలప్రాయ మొదవఁగాఁ గాంచియతని, పెండ్లిసేయుదమనుచుసంప్రీతినొందు
తల్లిదండ్రులతోడ బంధుతతులతోడఁ, బరిణయము నొల్ల నే నని పలుకుచుండు.

ఉ. వారలు పెండ్లి యేమిటికి వల్లనటంటి వటంచుఁ బల్కినన్
వారల కాతఁ డిట్లనియె వారిజనేత్రల నమ్మరాదు మా
మాయావచనాప్రవీణలు పరానుగ లేచ్చ లొకింత యే మనన్
వారక నాఁడురూపములు వ్రాసినయింటను నిల్తురే బుధుల్. 266

క. కుల మెంచ రాడికోళ్ళకుఁ, దలకరు నడి వావివరుసఁ దలఁపరు నీతిన్
దలకొనరు సత్యమాడరు, కలకంఠులు వారి నమ్మఁగా నెటు నచ్చున్. 267

ఉ. చన్నులకన్న మున్నొదవు సాహసము ల్పఖికించు దృష్టికిన్
మున్నుఁగఁ బుట్టుఁ బెద్దలను మోసము పుచ్చు మనీష యావనా
సన్నతకన్న మున్నె యగు సత్య మసత్య మసత్య మెన్నఁగాఁ
దిన్నఁగ సత్య మంచు ధృతి డీకొను ధీరత పువ్వుబోండ్లకున్. 268

ఉ. టెక్కులు నెమ్మెలున్ సొగసు ఠీవియు నాగరికంబు నిద్దపుం
జక్కఁదనంబు జవ్వనముసంపదసొంపు వినోదపున్వగల్
చొక్కపువైఖరు ల్నతుల సూడిదె చాతురి గల్గువారికిన్
దక్కినయట్లు భర్తలకుఁ దక్కరు నిక్కువ మింతు లెంతయున్. 269

తే. గరగరిక నుండు మోహనాకారవిభవ, శుభవయఃపాకపురుషులఁ జూచినపుడె
దృష్టి వారలపై నిల్పి తెవులు లేని, దశలఁ గృశియింతు రింతులఁ దరమె తెలియ.

క. అని పల్కెడు తత్పుత్రునిఁ, గనుఁగొని తలిదండ్రు లాప్తగణములు బంధుల్
వనితాభిముఖునిఁ గాఁ దమ, యనుపమచాతురి నొనర్చి రతిసంప్రీతిన్. 271

క. కులగుణరూపప్రజ్ఞా, దులు గల కన్యకల మానధూర్వహసంజ్ఞన్
జెలఁగిన యతనికిఁ బరిణయ, మలరఁగఁ గావించి రంత నతఁడు నిజాత్మన్. 272

తే. నెలఁతలను నమ్మరా దని నిశ్చయించి, పోఁతుటీఁగకు నైనను బోవరాని
యొంటికంబపుమేడలం దునిచెఁ దత్స, తీద్వయంబును హితసఖు ల్దెలిసి ప్రోవ.

వ. ఇత్తెఱంగున నన్యులఁ బొంద శక్యంబు గానిసౌధంబుల నిజభార్యాద్వయంబును వే
ర్వేఱఁ గాఁపురం బుంచి తత్పరిపాలనార్థంబు పెద్ద లగుహితవయస్యుల నియమిం
చిన నచ్చెలిక త్తెల త్తీరున నన్నపానాద్యుపచారంబులఁ బోషించుచుండు నెడ భువన
మోహనాకారం బైన యావనోదయంబు సంభవించిన. 274

సీ. కంధర కమలారి కార్ముక సంజాత కాంచనకంబుల గర్వ మణఁచి
పద్మరాగ పటీర పద్మారి ఖండపల్లవ పద్మముల సముల్లాస మెంచి

వజ్రవల్లీద్వయవసుమతీధర వారణారి వారిజ వసుధాళిఁ గేరి
కదళికా కాహళ కచ్ఛప కలకంఠ కనక కర్పూరసంఘముల మీఱి
తే. కచముఖభ్రూనయననాసికాగళోష్ఠ, పరిమళ కపోల కోమలపాణిదంత
బాహుకుచమధ్యగతినితంబాంకజాను, పదపదోంగస్మితము లొప్పు భామినులకు.
చ. తరుణులగౌను లాకృతులు తళ్కు మొగంబులు చన్గవ ల్నవా
క్షరణులు పాణులున్ మెడలు సారనితంబము గారు రేఖలున్
వరళవిలోచనంబులు పదంబులు మేలు మణుంగు గాదయున్
హరికమలాబ్ధచక్రనివహంబు నయంబు రయంబున న్నగున్. 276
సీ. ధరజయోన్నతి మించెఁ దనరుచన్నులు కృష్ణ వర్ణఘనాకృతి వఱలె నెఱులు
కనుబొమల్ ధర్మవిఖ్యాతిఁ గైకొనె ముఖంబులు నిశాకరకళాకలనఁ గనియె
జలవరసంభ్రమంబులఁ గేరె నాభులు కటులు మహాబలోత్కటతఁ దనరె
నీలకంఠప్రియశ్రీ లందె నారులు గజరాజగతిఁ దాల్చె గమనగరిమ
తే. యమరకాంతల లీలల నవయవములె, పరిహసింపఁగ నెఱయు నప్పద్మపత్ర
సదృశనేత్రల కిఁక ధరాస్థలిఁ జెలంగు, చెలువ లన నెంత హేసనిర్జితలతాంత. 277
సీ. మెఱుఁగు మోములు ప్రభాకరబలంబు వహించె లపనము ల్చంద్రబలంబు గాంచె
జఘనము ల్వసుమతీజాతబలం బందెఁ గలితవర్ణంబులు సౌమ్యబలముఁ జెందె
గురుబలంబు భరించె గుబ్బచన్గవలు నఖంబులు శుక్రబలంబుఁ బూనె
మందబలంబు సమ్యగ్యానములు దాల్చె స్వర్భానుబలము కచంబు లొందె
తే. నళను కేతుబలం బూనె నలరు కన్ను, లిట్లు సకలగ్రహబలాప్తి నెనసియుఁ సుమ
నోజబలవేధఁ దత్సతుల్ సైఁపనాథ, బలము చాలక యోడరి పరబలంబు. 278
వ. ఇవ్విధంబున నివ్వటిల్లు యౌవనగర్వాతిరేకం బగు నిర్మానుష్యంబు లగు సౌధాంతరం
బుల నుండుటం జేసి పంజరబద్ధకీరం బలదాగిని నపారగాంభీర్యవిచారపూరితమా
నసలైన యామానసకాసారగభీరనాభులు స్వాత్మగతంబున. 279
క. పతిరతి తీరదు తమి పర, పతిరతి యేటికి కోరదు భావంబునసం
గత మగు నీ వెతఁ దీర్చెడి, హితవరు లెవ రని తలంచి రెంతయు వంతన్. 280
సీ. అమరఁ దిర్యగ్జాతులం డైన ప్రియుక నవజన్మముల యందంగ నొనర్చె
నొనరించుఁ గాక నిం పొదవంగఁ బురుషులఁ జేయక మర్త్యుల స్త్రీలఁ జేసెఁ
జేయుఁగాక రతిచ్ఛఁ జెందువానికిఁ గాల్ప కీలి నిర్మోహి కేల మార్చెఁ
గూర్చుఁ గాక యభేచ్ఛఁ గాని చరింపఁగ మంచ కమర్గమస్థలి నేల యుంచెఁ
తే. గటకటా మాయెడా పాపకత్నవ్యాధయుఁ, దాయెఁ గాంచ దోలువాణిశుఁ దటులగాక
యున్న నిట్లేల చేయు నం చువిద లార్త్యఁ, బరితపింతురు మరుబాధవిరహ మొదవ.

వ. ఇట్లు తమకు వలయుంనెడఁ బడఁతుల గొడవ తడపనితమయొడయఁడు తమ్మమిగులఁ గూడి యాడి యుండమికి దుర్గమస్థలసంస్థితలగుట జారక్రీడకుఁబోసఁగమికిఁగంతు శరసంతతసంతాపంబునకు సంతపించుచుఁ జిన్నఁనాటనుండియును దమ్ము నెత్తి పెంచినదాదులకుసైతము నెఱుంగ నీయకయుండొక తెఱంగుననయ్యంగనలు మెలంగు చుండి రయ్యెడ సువర్ణయనుతదగ్రభార్య మోహంబున మదనాదుల నుద్దేశించి తన మనంబున. 282

సీ. నీసుమశరముల నీసుమసమహాస నీసుమతిని నేయ నేల మదన
నీరాక తలుకునన్నీరాక విడకపో నీరాక శాకల నీరజారి
ఘనమార్గ ముడిగించి ఘనమావధూవధ ఘనమావిహాపాది వనుచు నిన్నుఁ
బవమానకరుణ నిం పవమానగతిఁజరిం పవమానమున కల్కు వడవు నీవు

తే. మధురధర్ముఁడు సర్వజ్ఞమౌళి సురప, థానువర్తి మహాబలుండనెడు నిజమ
హాత్మ్యములుమాని యిట్లు స్త్రీహత్యఁ జేయం, చున్నమీరీతి నెవరైన విన్న నగరే.

క. తారాధిప రజనీకర, కైరవభేదనవిచక్షు గౌరీశశిరో
దూర కమలానురంజన, కారణ వారాశిభంగకారాభ్యుదయా. 284

చ. పరిధిమిషంబు మూలికలఁబంతి కలంకపుగావుబొట్టు భీ
కరకిరణంబులన్ జడలు కామువిభూతియుఁ దాల్చి మంత్రివై
విరహులఁ జంప సాగితివి వే యన నేమిటి కూరు మొక్కచేఁ
బరఁగిన తోడుబోఁతులరపం బనుమాట నిజంబె పో శశీ. 285

క. కీరమణీ నీకోడక, కీరమణీ రత్న మిదియ కిల్బిషమతివే
కీరమణియపుఁజమవు శు, కీరమణాకాని వారె కీరాలాపల్. 286

తే. మాటిమాటికి వేఁడు నీమాటియెడలఁ, బాటి దప్పినవార లేపాటివారు
గావున దయార్ద్రబుద్ధి న న్గావు నీకుఁ, దేఁటి నామీఁదఁ గోప మింతేటి కరయ.

క. పికమా ఘోరాకృతి చూ, పిఁక మాదృశవిరహిణుల రతీశమహోద్ది
పకమార్గము చూపఁగ నో, పికమానస మూని యేఁచ బింకమె నీకున్. 288

వ. అని వెండియుఁ నయ్యండజయాన పెక్కుతెఱంగుల నయ్యనంగునిసైన్యసమేతంబుగఁ బలుకుచున్న సమయంబున దైవయోగంబున. 289

ఆ. ఆసువర్ణమందిరాంగణమున నొక్క, పాదుకాద్వయంబుపడియె నంత
దానివెంబడిన మిహీనిర్జరుండొకఁ, డతిరయమునఁ బడియె నంగ మద్రువ. 290

వ. ఇట్లు పడిన యప్పుడమి తెఱగంటికొమరు నత్యనుపమమోహనాకారు నిరీక్షించి భ యవిస్మయహర్షాదులు ముప్పిరిగొనుచిత్తంబున డాయం జని యొంటిపాటగుట వివి

ధోపచారంబుల నేద దీర్చి నీ వెవ్వండ వి ట్లిందుఁ బఱుటకు నిమిత్తం బేమి యనిన
నాసువర్ణు నతండిట్లనియె. 291

మ. హిమవత్పర్వతమందు నుండుఁ డనుమానీంద్రుం డొకం డుండు సం
యమిచంద్రుండు తపఃప్రభావుఁ డల సన్న్యాసిన్ వెసన్ మోసపు
చ్చి మహాభ్రస్థలి వాయువేగమున వేంచేయున్ సమర్థంబులై
యమరం బావలు తాను బూని చనుచో నాకాశమార్గంబునన్. 292

ఉ. ము న్నలవాటులేమిఁ బదము క్తములై పడె నిందు పావలే
ను న్నిలు పోపలేక దివినుం డిట వ్రాలితి పట్టిపావలెం
దున్నవో చూపుమం చనిన సుగ్మలి యం దొకచోటఁ గాంచె మేల్
పొన్నపుసన్నపుం బనుల సొంపు ఘటింపఁగఁ జాలుపాదుకల్. 293

వ. వాని గ్రహించి యచ్చంచలాక్షి యాహారాదివిధుల సంతుష్టుం జేసి యాబ్రాహ్మణ
కుమారు నెత్తుకొని తత్పాదుకాసామర్థ్యంబున నిలయనికటనిజపతికేళికారామంబు
చేరి తదనంతరంబ. 294

ఆ. తగినప్రహరిగోడ దక్షిణోత్తరముల, నలరు పెడఁద కూట మంద మొందు
మందిరంబు గాంచి యందొక్క యఱఁ దన, పడకటిల్లు చేరెఁ బద్మనయన. 295

* * * * *

క. నీ కితరభయంబులు రా, నీక మెలంగుదు నటంచు హితవు గఱపి బి
బ్బోకిని యతనకి వ్యయమున, కైకొంతపదార్థ మిచ్చి యనిచెం బురికిన్. 297

వ. ఇట్లతనిఁ బ్రియపూర్వకంబుగా నాదరించి సెలవొసంగి క్రమ్మరఁ దనయిల్లుచేరె నివ్వి
ధంబునఁ దత్పాదుకాసామర్థ్యంబున. 298

* * * * *

వ. ఇవ్విధంబునఁ బ్రథమభార్య సుఖించె నంత ద్వితీయభార్య యగుసుప్రభయుం సప
త్నిరీతినుండియుఁ బరపురుషవాంఛ వొడమి కడుమిడుకుటం జేసి యేచందంబునం
బొద్దువోక యొక్కనాఁడు సౌధాగ్రంబున. 300

క. ఆసుప్రభ సంగీతక, ళాసరసత గలది యాట లలితముగ సము
ల్లాసమున వీణమీటుచుఁ, జేసెన్ గానంబు సౌధ శిలలు ద్రవింపన్. 301

క. సురపథమున నపు డొకముని, యరుగుచు నిజగాననిస్వనాకర్ణనవి
స్ఫురితానందంబున నట, కరుదెంచిన లేచి చూచి యతనికి మ్రొక్కెన్. 302

తే. మ్రొక్కి నిలిచి వనిత మునితో స్వవృత్తాంత, మంత మనము గరఁగునటులఁ దెలిపి
దేవ నీవు రతులఁ దేలించి ననుఁ బ్రోవు, మనుచు వేఁడుకొనిన నబలఁ జూచి 303

తే. నేను విజితేంద్రియుండనుగాన సతులఁ, జెందఁ గారాదు నాకుఁ బూర్ణేందువదన
యైన నీయిష్ట మీడేరు నట్టిసేర్పు, తెలియఁ జెప్పెద విను మని తెరవ కపుడు.

వ. కారుణికాగ్రేసరుండై యొక్కసిద్ధమంత్రంబు చెప్పి యీమంత్రస్మరణంబునవలయు
నెడకుం బోయి రావచ్చుఁ గావున నీవాంఛితంబు దీనఁ దీర్చుకొమ్మని యానతిచ్చి
మౌని విచ్చేయుండు నంత నాకాంత యత్యంతసంతోషంబున నొంటిపాటైనసమ
యంబున. 305

క. ఆరాజన్మంత్రస్మృతి, నారామము చేరి యున్నయపు డచ్చటికై
చేరినఁ దద్వనపాలుని, మారసమాకారుఁ జూచి మది ముద మొదవన్. 306

* * * * *

క. ఆదిమొదలు వానిఁ గవగొని, మదవతి యారామమధ్యమందిరమున నిం
పొదవఁగ రమింపఁ దొడఁగెను, మదనుఁడు విల్లెక్కుడించి మరలి చనంగన్. 308

ఉ. అంతట నొక్కనాఁటినిశియందు శశిగ్రహణంబు గానఁ ద
చ్ఛాంతికి స్నానదానములు సల్పను వేఁకువజాము వచ్చువ
ర్యంతము పట్టునం దనుక రాఁ డిపు డింటికి నాథుఁ డంచు దా
దెంతయు వచ్చి చెప్పిన మృగేక్షణ లాత్మల వేడ్క లూనుచున్. 309

వ. ఒంటిపాటై యున్నసమయంబున. 310

* * * * *

* * * *

సీ. ఫణిరాజతల్పంబుపై పద్మనాభుండు తిన్నఁగా శయనించు పన్నెఁ దెగడి
తనరు శ్వేతద్వీపమున గాఢతమి నొక్క దెసనుండి పర్వెడు పస హసించి
క్రమమునఁ బుష్పగుచ్ఛముమీఁద మగతేఁటి మొత్తంబు వ్రాలెడు దత్తుమీఱి
హిమశైలతుంగశృంగమున నీలాభ్రంబు పర్యాయమునఁ గప్పుభాతి మెఱసి

తే. సార కర్పూర డిండీర హారహీర, తారకోదార ధవళాంశువారకలిత
నీరజారాతిబింబ మున్నిద్ర రౌద్ర, గతిఁ గ్రసించెను రాహు వక్త్రాలమునను.
సీ. మంత్రికుమారుఁ డామానధూర్వహుఁడు దివ్యౌషధం బవ్వనం బందుఁ గలుగు
టెఱిఁగి యుండుటఁ జేసి హితమిత్ర పరిజనాన్వితముగ దివ్వటీ ల్వెలుఁగఁ నేగి
బదరిక గలపాదపముఁ జూచి యది తీసికొని రండు పొం డని కొందఱు హిత
పరుల నంపించి వా రరుదెంచునందాఁకఁ డా విశ్రమింపఁగాఁ దలఁచి తనదు
తే. సతులకెప్పుడు సంకేతసదనమైన, తద్వనీమధ్యసద్మంబు దండ కరుగఁ
బ్రస్ఫురత్కరదీపికా ప్రభలు చూచి, పరు లెవరో వచ్చిరని యుపపతులు వడఁక.
తే. వెలివడఁ డటంచు వెరపుచే వెన్నుఁ జఱచి, యుపపతుల నిండ్లలోన నెయుండఁజేసి
నిలయములనుండి వెలువడి నెలఁతలు తన, కెదురుగారాఁగ మదిఁగోపమొదవఁజూచి.
తే. పరుల కటు తొంగిచూడను బాటుగాని, దుర్గమస్థలి నుండెడితోయజాక్షు
లివ్వనంబున కేరీతి నెమ్మె మెఱసి, వచ్చినా రనుసందియం బిచ్చఁ బూని. 316
తే. ఇమ్మహానిశి నిచ్చోటి కేమిపనికి, వచ్చితి రటంచు గద్దించి హెచ్చరించు
తోడవల్లభుని నవ్వేళ వనిత లెట్లు, బొంకి పోవలె నెఱిఁగింపు పంకజాక్షి. 317
క. అని యడిగిన హేమావతి, తనతలఁ గదిలించి తెలిసి తా నిది వివరిం
పను జాల నీవె తెల్పుము, వినియెద నన హంస మపుడు వెలఁదికి ననియెన్. 318
తే. మానధూర్వహుఁ డప్పు డామానవతులఁ, గాంచి వీరలు మత్కులకాంత లనుచు
నిశ్చయించుక రౌద్రనిర్నిద్రబుద్ధి, మీర లివ్వేళ నిట కేల చేరినారు. 319
ఉ. చెప్పుఁడు చెప్పకున్న మిముఁ జిత్రముగా వధియింతు నంచు కోఁ
డప్పుఁడు తమ్ము రొప్పిన భయంబు వహింపక యాసుపర్ణసాం
పొప్పఁగ భర్త కిట్లను సుఖోన్నతలీలల నివ్వనంబునన్
దప్పక సంచరించు వనదైవతకాంతల మమ్ముఁ జుల్కఁగన్. 320
క. నీమనమున మద్భామిను, లీమగువ లటంచు మమ్ము నెంచితి వాదిన్
మేము భవదీయసతులము, గా మస్మత్కళలు నీదు కామిను లనఘా. 321
వ. అదియునుంగాక. 322
క. ఈయెడ మేము చరింపను, మాయంశమ్ముల జనించు మదిరేక్షణలన్
నాయిల్లాం డ్రని పల్కితి, వే యేమి నిమిత్తమనిన నెఱిఁగింతు మొగిన్. 323
తే. చైత్రరథమున మును మేము సరసగతుల, సంచరింపఁగ నవ్వేళఁ జైత్రుఁ డచటి
కరుగుదెంచినఁ గాంచి యనాదరమున, లేపకుండిన సక్రోధలీలఁ జూచి. 324

తే. సాపరాధుల మమ్మావసంతుఁ డరసి, మర్త్యసేవను నూఱేండ్లు మహిని మెలఁగుఁ
డని శపించినఁ బ్రత్యక్షమటుల నుండఁ, జాలమని మేముప్రార్థింప సదయుఁ డగుచు.

సీ. ఆరీతిమీరు ప్రత్యక్షంబున మెలంగ కున్న నేరం బేమి యువిదలార
మీయంశములఁ బుట్టి మెలఁతల మానధూర్వహుఁ డను బహుమానవరకుమారుఁ
డగువిప్రునకు భార్యలైయుండ నియమింపుఁ డని తెల్పి యావేల్పు చనిన నచటఁ
గూర్మితోనీకు మేల్గోరుచు నున్నవారము సువర్ణ యన సుప్రభ యనంగ

తే. మామకాంశముల జనించు మనుజసతులు, నీకుఁ గులకాంత లైనారు నిక్కమిదియ
రూపయౌవనసంపదారూఢి నీవు, చానలకు మాకు భేద మింతైన లేదు. 326

తే. ఇట్టిచుట్టరికం బుండు టెఱిఁగి కాదె, నిను సహించితి మితరభూజనులు మేము
మెలఁగుచోటికి నివ్వేళఁ బోలసినపుడె, చెడ శపింతుము నీవింక సుడియరాకు.

క. చుట్టరిక మెంతగలిగిన, రట్టున రారానియెడకు రా వారలపై
నెట్టిసుబుద్ధులకైనను, బుట్టును రోషంబు దానఁ బుట్టుం జెట్టల్. 328

క. కావున నీవిచటికి నిఁక, రావలదు వసంతశాపరహితలమై మా
దేవవని కేగినంగట, నీవిట నెమ్మదిఁ జరింపు నీయాప్తులతోన్. 329

క. అని సంతోషము భీతియు, జనియింప సువర్ణపలుకు జాడనెపలికెన్
వనితామణి సుప్రభయును, విని తద్వాక్యములు మాని విభుఁ డపుడాత్మన్. 330

ఆ. ఏపు జవ్వనంబు రూపొక్కటై యుండు, టాత్మసతులు వీర లనుచు నుంటి
నేము నీసతులము గా మన్మదంశజ, లీలతాంగు లని రిదేమొ సతులు. 331

క. ఇంటికిఁ జని కనఁదగు వా, ల్గంటుల నీపలుకు లాత్మకామిను లింటం
దొంటిగతి నున్న సత్యం, బింటను లేకున్నఁ గలయ యిది దృఢ మరయన్. 332

ఆ. అనుచు నిశ్చయించి యతఁ డింటి కేగెను, వానికన్న మున్నె వనజముఖులు
నిజసమర్థతాప్తనిలయంబులకుఁ బోయి, పవ్వళించి యుండి రవ్విభుండు. 333

చ. వెసఁ జనుదెంచి యింట నలివేణులఁ గన్గొని తద్వధూవచో
విసరము సత్యమా యనుచు వేడుకఁ గైకొని తప్పనిద్రలుం
బసగల హంసతూలికలపాన్పులపై శయనించి యున్న యా
త్మసతుల లేపి తొంటివనితావిముఖత్వము మానె మానినీ.

తే. అరమరలు లేనికూటమి నధిపుఁ డపుడు, కులవధూటుల నెంతయుఁ గుస్తరించి
పచ్చి వగదేరు రతులతోనిచ్చ నిచ్చ, లిచ్చకము పుట్టఁ జేయుచు నెనసి యుండె.

క. ఈమహిమ నీకుఁ గల్గిన, భూమివిభుఁ రతులఁ గలయఁ బొమ్మని హంస
గ్రామణి నినిపించిన విని, హేమావతి మెచ్చుకొని ఖగేంద్రుని కనియెన్. 336

తే. జనపతిని జేరఁ బోనీక దినము దినము, కతలు చెప్పఁగ సాగితో కతలకాని
చిన్నిరాయంచ యింకనైన సెల వొసంగు, పోయివచ్చెద ననహంసపోలఁతి కనియె.

క. ఇరువదిదినముల కింటికిఁ, బఱతెంతు నటంచు నీదుపతి చనుచో నా
కెఱిఁగించె రేపవశ్యముఁ, బఱతెంచును గాన నీకుఁ బఱపం దగునే. 338

చ. నరపతిఁ జేర దర్పకరణక్రియలన్ దగఁ బ్రొద్దుపుచ్చి ని
ద్దురగొని యైనరాజు నినుఁ దోడనె పాయఁగ లేనిమూర్తి మం
దిరమున కేగు మన్ దనుక నిప్పన నిల్చుటనైన నింటిలోఁ
దెరవరో నీవు లేమి నరుదెంచిన నీపతి యేమి దోఁచునో. 339

క. కావున భూవిభుఁ జేరం, బోవుట కార్యంబు గాదు పొమ్మింటికటం
చావనజాక్షికి హంసయు, రావరమణి దెల్ప నపుడు రవి యుదయించెన్. 340

తే. అంత హేమావతీయుహృదయాంతరమున, భూమివిభుమీఁది మోహంబు పొంగిపొరల
బడకయిలు నేరి వేఱొక్కపగిది నుండె, నపుడు తత్పతిసహచరుం డరుగుదెంచె.

క. అదిగో నీపతి వచ్చెన్, ముదమున నగరోపకంఠభూమిని విడిసెన్
సుదతి ననుఁజూచిరమ్మని, పదపడ ముందుగను నన్నుఁ బనిచెన్ వేడ్కన్. 342

క. అని చెప్పినఁ దద్వాక్యం, బనలశిఖాకీలతప్తమై చెవి నాటన్
ఘనభయవిస్మయలజ్జా, తనుహర్షభరాదులాత్మఁ దగిలినవగతోన్. 343

ఉ. దిగ్గున లేచి నిల్చి సుదతీమణి భూవిభుమీఁదిబుద్ధితోఁ
దగ్గుచు మ్రగ్గ నిగ్గు సిరితగ్గనితామరమొగ్గదోయి బల్
జగ్గుల కెగ్గు నింపెసఁగుచిక్కనిచక్కని గబ్బిగుబ్బలన్
నుగ్గడితంబు పయ్యెదయు నొప్పగుఁ గ్రొమ్ముడి చక్క దిద్దుచున్. 344

ఆ. ఓడబేరమాడ వేడుక నేనేగి, నదియుం మొదలు శుభమె యందఱకును
ననుచు బాంధవాదిజనుల యోగక్షేమ, మడుగ భద్ర మఖిల మనియె నతఁడు.

క. వెండియు నిట్లను మనవే, దండలసద్గమనత్రో సుధారసధారా
పాండిత్యమండితోక్తులఁ, బండితమండలికిఁ జెవులపండువుగాఁగన్. 346

క. జనపదములు పురగిరులన్, గనులు వనుల్నదులు నిధులు కట్ట మిట్టల్
కనుమలు పేటలు తోఁటలు, మునుకొని కనుఁగొనుచుఁ బోయి మ్రోలన్ లీలన్.

సీ. ముజ్జగంబులు బూతముగఁ జేయ నగుధాత, వనభంగ గంగ యెవ్వనికి భార్య
దేవావనోత్సాహదృఢకళాసందోహ, మున మించు చంద్రుఁ డెవ్వనికి సుతుఁడు
కడలేని సిరులీనఁ గలరమాగజయాన, యలరారు నెవ్వాని యనుఁగుకన్య
బహుళపద్మభవాండపరిపాలనాఖండ, వాత్సల్యశౌరి యెవ్వనికి నల్లుఁ

తే. దట్టిన ప్రసూతికుసుమాఢ్యవాత్స్య, రాజనీయాన కేళీమహాబహాఙ్గి
మాలికాడోలికాసాధికోల్లసన్న, రాళికోల్లాసికలశవారాశి డాసి. 348

వ. సభయభక్తిపముస్కారంబు గావించి తదుత్కటతటంబున. 349

సీ. జాతిలీలాయతిసకలాతిమేల్కట్లు కాబలపసకిముఖాబులోనఁ
బైఠణీజరబాబుపసలగోపసరాలు మేలరబ్బిమొకమాలు దిండ్లు
గోవబూర్నీసునిగ్గులబిల్లసంతన బలుచీనిపహాంబట్టుప్రగ్గములును
దగుటురుమ్మీతాపుతానవారు కసీదు నేస్తు బందరుచీటి లస్తరీలు

తే. ఖాతువా జంబుఖాన మఖాతివాసు, లరల సుకదాసులబనాతు లమర దిండ్లు
కాంచనస్తంభములు రత్నకలశతతులు, వాళ్లలును గుజ్జుగుండాగుత్రాళ్ల మఱియు.

క. హితవరులతోడ యుష్మ, త్పతివేఁడుక విడిసి సకలపరిమళవస్తు
ప్రతతులు మౌక్తికవిద్రుమ, వితతులు మొదలైన రస్తు వెలఁదీ కొనియెన్. 351

సీ. తత్కటద్దంపునిద్దపునిల్వుటద్దము ల్దంతపుదువ్వెన ల్తావులాల్కు
నత్తరుఁ బునుఁగును నంబరు గౌళక చూర్ణరము ల్నఖము గంబూరచోవ
జిగ్నిసవరములు జిల్లరసము కదం బము గోవ జవ్వాజి పచ్చిపునుఁగు
కురువేరు పచ్చకప్పురము పన్నీరుచే డెము మలాకెలు కుంకుమమును మంచి

తే. బుక్కకస్తూరిపీఁకెలు చొక్కటంపు, టగరు సంపెంగనూనెలు నాదియైన
మెచ్చుగలదీవులందుండి తెచ్చినట్టి, వివిధపరిమళవస్తువు ల్వెలకుఁ దీసి. 352

సీ. ఘర్జరకలును బింగాండ్లు తాబాణాలు గిన్నెలు తబుకులు గిండ్లు స్నపన
పాత్రలు చట్లును బానపాత్రలు మేలు చట్టువంబులు మంచిమట్టుగిండ్లు
సంపుటంబులు గొప్పస్థాలీలు తబుకులు కంచము ల్తట్లు గంగాళములును
చెంబులు పడిగముల్ చిప్పలు హస్తావళులు కంకణములు ఘంటలును గజ్జె

తే. లాదిగాఁగల్గు దీవులయందు వెలయు, కంచరపుజాతిపగవగ ల్మించఁ జేసి
నట్టిసామగ్రి బహువెల ల్పెట్టికొనియెఁ,గాంతభూకాంతమణులకుఁ గానుకఁ జేయ.

తే. వేఁడికొదమలవింతయౌ నేటిపునుఁగు, పిల్లుల జవాజిపిల్లుల బెట్టురురుల
ముంగిస సివంగి జోఁణంగి యింగిలీషు, కుక్కగుంపులఁ గోఁతులఁ గొన్ని గొనియె.

సీ. సంపంగికావులుఁ జందురుకావులు వెలిపట్టుపుట్టముల్ వేఁటచాళ్లు
జిలుగుబొమ్మంచులచీరలు నాచులు నుదయరాగంబులు నురుతవన్నె
లొప్పుముయ్యంచులపుప్పొళ్ల హొన్నంచు వలువలుఁ గరకంచువస్త్రతతులు
ముత్యాలపందిళ్ళు నుత్తరగోగ్రహ ణములు నిగమగోచరములుఁ బద్మ

తే. ఫుతిలకలు నింపువన్నెలం బోదలు బచ్చు, లును హరిపళ్ళ హంసవల్లులునురంగ
వల్లు బోదలును సామంతవములు ననఁగఁ, దనరెడుపసందుపటములు గొనియె వెలకు.

రగడ. చౌకట్లు నొంట్లు చేసరులునుక్ మొలకట్లు
రాకట్టుచుట్టుంగరములు బల్చేకట్లు
మురువు లొప్పు కిరీటములు మేటితాళీలు
సరిపణలు మించులును సాటలేనితురాలు
రంగుగల ముంగామురాలు సాభరణములు
సంగదంబులు మంచిహంవీరతాయెతులు
కంఠమాలికలు జిగిగల్లు చేకడియములు
కంఠసరములు బిరుదు గండపెండేరములు
సద్దంపుటు త్తిరిగె లలరు చిఱుగజ్జియలు
కుందనపుఁ జెక్కడము గుల్కుమణిఘంటలను
మితిలేనివెల లిడిన మేఖలా లందియలు
చకచక ల్గలజాతి సకలమణినికరములు
నకలంకవర్ణపట్టాంబరప్రకరములు
పీతాంబరంబులును బేర్వడిన బురుసాలు
జాతినీలాదులును సాలువులు చీనీలు
పచ్చపట్టులు తగటుపాగలును నంగీలు
నచ్చపు మెఱుంగు గల యవురంగజేబీలు
బుదుత కాసీలు మహమూదులు నిరాసీలు
సరి సేయరాని హంసావళులు లాకీలు
మాదళంబులు వెన్న మబుగులు ముసజ్జీలు
చాదరలు పైడిణిలు చక్కనికబాయీలు
నదరు చిల్లానితేం ట్లమరు బుర్నీసులును
నడికట్లు మేఘవర్ణంబులును ద్రోపులును
మొకమాలులును సూర్యపుటములు బనాతులును
సకళాతులం చెలువు చలికప్పడంబులును
హొంబట్టు లోడీలు హొనకాదుకూలాలు
కమ్మాయితలుడాలు గల్గుజిరబాలీలు
వింతవింతలుగాఁగ వెలసినభపంతీలు

కాంతిఁ బతి వెదచల్లఁ గల్గినసరంతీలు
దుడ్డుకంబళ్ళు చందువలు తివాచీలు
పట్టులకుఁ గైకొన్న బలుజంబుఖానాలు
ప్రతిలేనిపట్టంచుపలురత్నకంబళ్లు
నతులితము లైన చతురంగములబల్ల్బలము
తళుకుపగడపుకోళ్లఁ దగుపట్టెమంచములు
కులుకునెత్తావికుంకుమపువ్వుతల్పములు
ఏకరంగితలాట లిడుగోర లేజీలు
హాకచూపట్టు సురతాణి సింగాణీలు
కళలుదేరు పిరంగి కత్తులును బారీలు
పొలుపొందు నంపలపు బొంగులును గేడీలు
ఎది కైకొనిన హారబ్బి కెలును వన్నియలు
పేరైన సూరత్తు సింగాణివిన్నియలు
రాయంచ లైదుసర్ణము లైనకీరములు
మాయురే యని మెంచ మరుపట్టు జీనీలు
చీర్ణంపుపనులమించినపిరగిపీఠములు
నిర్ణయింపఁగరానినిజలసద్వస్తువులు. 356

క. స్వరమండలములు కిన్నెర, లురబాబులు పండవీణ లురుజారుతరా
ల్వరరావణహస్తంబులు, మరితంత్రులు తంబురలు సమస్తము గొనియెన్. 357

వ. అయ్యవసరంబున. 358

సీసమాలిక. రాయదుర్గముగుత్తి రాయవేలూ రాసెగొంది మాహురి కాశి గోలకొండ
ముంగిపైఠిణి డిల్లి ముఖవాయజాబురా బాదుమబ్బా మహోమూరు మచిలి
బందరు సూరతు చెంవరు గోవేరు శ్రీరంగపట్టంబు చెంజి కాంచి
బాదము నౌరంగబాదు దౌల్తాబాదు కప్పర గాగర గదుగు బిదిలి
కోట కల్యాణము గొందాన మహముదానగరంబు బంగాళ నరస గోన
పన్నాళ చనరంగపట్నంబు గలగల గజరాజధాని బంగాపురంబు
కాంబాగర ప్రయాగ ద్వార కాయోధ్య లక్ష్మీశ్వరంబు సోలాపురంబు
మధుర కొల్లాపురి మగధ మాయావంతి కాపురాణపురముల్ కాబలగయం
నాదవేని కళింగ మాసూరు వినుకొండ కొండవీడును నేలకొండపల్లి
పొదిలె తంజాపురం బుదయగిరి కైసూరు మైసూరు పెనుగొండ మంగళగిరి
బనుపట్నము సీప్పి భద్రాచలము పాలవంచనిజాంపురి వందవాసి

కుందిర్పి బెల్లముకొండ దేవరకొండ రాచర్ల మునిమడుగు రాయపురము
సైదాపురము గోవ సాళ్వాక మూపాడు రాపత్రి మాచెర్ల రాచవీడు
బనగానిపల్లె కంభము పోరు మామిళ్ల ధారాపురము చీని తాడిపత్రి
నంద్యాల చిరువల్లి నందవరము కందుకూరు రామయపట్న మారుజండ
హంపి విరూపాక్ష మారణి వెంపలి కాంపిల్యనగరంబు కందనూరు
కడప సిద్ధవటంబు గండికోట కనూరు సింహాద్రి పుట్లూరు చింతగుంట
గయ చెన్నపట్నంబు గండవరం బోరుగల్లు దామెనచెర్వు వెల్లటూరు
కల్లూరు కలువాయి నెల్లూరు వేలూరు రామూరు చదుమూరు రాచకొండ
కదిరి కూటాగుళ్ళ గంగేరు శృంగేరు రామళ్ళకోట వజ్రగిరి నుసుము
సూగూరు చోబాడ బాగూరు కొళ్యాల గుడిబండ బళ్ళారి కొత్తకోట
గుమిలేనిపాళెంబు గొబ్బూరు బళ్ళాపురము పుంగనూరాను రామతెంకి
మాసవ కౌతాళ మానుకొం డైనూరు జలపూరు పెదపలి జల్లికోట
కుంభకోణము కోటకొండ తంజావూరు పెరవలి దుప్పూరు బెంగుళూరు
వొత్తూరు చిత్తూరు హుణి చిత్తనాపల్లి రాజవో ల్గద్వాలు రాచనగరు
చిరుతని కాళహస్తి సినూరు మధ్యార్జునము తిరుసామల నాముకొండ
పాకల కావేరిపాక మోహానగిరి చదుకూరు మల్లూరు చాదుకొండ
పాగొండ వావిలి నాగోలు తాళ్ళూరు మైలాపురము జెడ్డమంగళంబు
రామసముద్రంబు రామాపురము జటప్రోలూరు వెల్లాల భువనగిరియును
హరిపనల్లీ జేదనరవారి గొండాపురము గౌరి మాయూర మమరవీడు
నడిగల్లు కొక్కల్లు కడపకోలను రత్నగిరి వెలిగోడు తంగెళ్ళ దగ్గి
కంగొంది తమగొండ గడవ నెత్తము దూస్తి సివనగాళ్ళవళంది సింగళంబు
మన్నారుకోవెల సొన్నగలు చిదంబరము వాగెనగరి పురాణపురము
వడియూరుపాళెంబు నుడిపి సుబ్రహ్మణ్య ముజ్జంగి మంపువా మోసవగలు
రామనాథపురంబు మాముగోళ్ళ బెడంద ధర్మవరంబును దాడిగోళ్ళ
మవణికె మందము మారకపురి కుంభి హారంగ ముజ్జాని హాలికె హల్లి
రెట్టిహాళి కురంజి రేపణి సన్నకి బాగూరు గుజ్జరి పాలువాయి
రామచంద్రాపుర మామూరు బెజవాడ కొండేరు కాండూరు కోటకొండ

తే. మొదలుగాఁ గల్గు జనపదమ్ములను దుర్గములను బేటలఁ బాళెలఁ బురులనెల్లయును
వర్తకులు వచ్చి రచ్చటివస్తుతతులు, బేరసారంబు లాడెదు పేర్మి మెఱసి. 359

క. ఆరీతి వచ్చువారల, కారయఁ దాఁ బిన్న పెద్దయై నీవిభుఁ డిం
పారఁగ వస్తువు లన్నియు, బేరము పొసఁగించి చేసి వెల కిప్పించెన్. 360

ఉ. అంచితబుద్ధి వర్తకజనావళి కిట్లు సమస్తవస్తు లి
ప్పించి తదీయభూములకు వేడ్కఁ జనుండని వారినెల్ల నం
పించి నృపోత్తవాజిరథబృందముపైఁ దనకొన్న రస్తు బొం
దించి సమిత్రుఁడై యరుగుదెంచెను నీళభుఁ డూరు చేరఁగన్. 361

వ. అనిన విని హేమావతీకాంత సంతోషంబున భోజనాదుల సంతుష్టుం జేసి తనయోగ
క్షేమంబులఁ బతి కెఱిఁగింపు మని యతని నంపి తదనంతరంబ. 362

తే. కథలు చెప్పుటయె కాదు కరుణఁ బ్రొద్దు, పోనియపుడెల్ల రాయంచపూనిచెప్పి
నట్టినయవాక్యములచేతనైన సన్మ,నీష హేమవతీమంజుభాష యపుడు. 363

క. పరపురుషసంగమం బిహ, పరసుఖదూరంబుగానఁ బాతివ్రత్య
స్ఫురణ గలసతులు మది గో, రరటంచును నిశ్చయించి ప్రమదం బెసఁగన్. 364

తే. చిత్రభోగునిపైఁ బ్రేమ చిందఁ జేసి, నిజవిభునిరాక కలరి యన్నీరజాక్షి
తనదు గృహకృత్యములు దీర్చుకొనుచునుండె,నంతఁ దత్పతియింటికి నరుగుదేర. 365

క. కుందనపుబిందియల హరి, చందనతరుఖండపట్టెసాతప్తంబై
క్రొందావు లొల్కుపన్నీ, టం దగ జలకం బొనర్చి తడయక యంతన్. 366

ఉ. ఆజవరాలు కీలుజడ నంబురుహోత్పలకేసరాలు వ
క్షోజభరాలఁ గప్పుకొను క్రొమ్ముగరాలసరాలు నంగుళీ
రాజవినూత్నరత్నముల రంగు చెలంగెడియుంగరాలు వి
భ్రాజితనూపురాలు పదపద్మములన్ సవరించి వెండియుఁన్. 367

సీ. వనచరంబులఁ గాన వచ్చె మైత్రికినన వేణి కాళిశ్రేణి విరుల దురిమి
సిటఁబుట్టినవాట నెమ్మి డాసె ననంగ గళశంఖమున హారములు ధరించి
జలజంబు లోటనె చెలిమిఁ జెందె ననంగఁ గరవారిజములఁ గంకణము లుంచి
సారంగజములోట సఖిత నొందె నన వక్షోజకుంభములఁ గస్తూరిఁ బూసి

తే. కనకరుచు లోట మిత్రత నన ఁగి పెనఁగె, ననఁగఁదను హేమలతనుమిన్నగుపదాఱు
వన్నెబంగారుపువ్వులవలువఁ దాల్చి, పతికి నెదురుగ నేగె నప్పద్మగంధి. 368

వ. ఆసమయంబున. 369

సీ. మిసమిసమూపులు మిగుచిట్లు గొలుపంగఁ గిలకిలనవ్వులు చెలువొనర్ప
ఘలుఘల్లు మని చిఱుగజ్జెలు రొదసేయ ఝళఝళమ్యాకుల కమ్మలు చలింప
ఝణఝణంక్రృతులఁ గంకణములు మెఱయంగ ఘనఘనధ్వనుల మేఖల నటింప
ధగధగద్దీప్తి రత్నపుసొమ్ము లలరార నిగనిగబాగలీ ల్నీటు చూప

తే. ఘుమఘుమలుగుల్కుమైపూతసొగసుగుల్క, గమగమలఁగ ప్రపువిడెంబుగంధమొలయ
మిసమిస ల్కుంకుమపురేఖ మించు లొల్క, ఖణిఖణిల్లని మెట్టియ ల్కుడురహింప.

క. తన కెదురుగ వచ్చిన తన, వనితామణి నపుడు చూచి వదనాంభోజం
బునఁ జిఱునవ్వొలయఁగ నెమ్మనమున నానంద మొందె మానిని యంతన్. 371

తే. విభునిపదములు పన్నీట వేడ్కఁ గడిగి, నెచ్చెలులతోడ వెస నివాళిచ్చి వైచి
యింటిలోనికిఁ దోడ్తెచ్చి యింతు లెంచ, భర్తతోఁగూడ నతిసుఖప్రాప్తి నుండె.

వ. అంత హేమవతీకాంతవృత్తాంత మంతయు నాత్మీయదూతి విన్నవించినవినికంపితశి
రస్కుండై కొంతదడవు చింతించి మహారాజచంద్రుండును నీతిజ్ఞుండును నకళంకుం
డును వివేకధురంధరుండును గావునఁ జిత్రభోగనృపాలుం డిటుల దనమనంబున. 373

ఉ. మున్నల రావణాదులు సముద్ధతిసాధ్వులఁ గోరి యేమి సౌ
ఖ్యోన్నతిఁ జెంది రిట్లగుట సుర్విజనావళు లన్యకాంతలం
బన్నుగఁ గోరరాదు కడుఁ బాతక మంచుఁ దలంచి యింతిపై
నున్నమనంబు ద్రిక్కొని యథోచితపద్ధతి నుండె భూవరా. 374

క. అనుచుఁ బురోహితుఁ డెఱిఁగిం, చిన నలరాజన్యమౌళి చిత్తాంభోజం
బున నద్భుతప్రమోదము, లెనయఁగ మెచ్చుకొని రాజ్య మేలుచు నుండెన్. 375

మ. నతసంజీవనజీవనేశభయకృన్నారాచనారాచర
వ్రతబృందారక దారకత్యనపదారక్షోభిరక్షోభట
శ్రుతసంధారణ ధారణార్హమణిభాసుగ్రీవసుగ్రీవము
ద్ధతలాలావనలావనద్యుతిచితాతారావతారావహా. 376

క. అక్షద్విడ్లక్షక్షీ, ప్తక్షేమకటాక్షదక్షపక్షతనూజా
ధ్యక్షనుతపక్షపక్షీ, ప్రత్యక్షోన్మేష్మ్యమవిపక్షరక్షోశిక్షా. 377

స్రగ్విణి. పద్మపత్రేక్షణా భక్తసంరక్షణా
పద్మగర్భస్తుతా భానుబింబస్థితా
పద్మబాణాకృతీ భవ్యశౌర్యోన్నతీ
పద్మసర్వేశ్వరా పాలితోర్వీశ్వరా. 378

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవిత్రాయ్యలరాజాన్వయసుధావార్ధిపూర్ణిమా
చంద్ర నిస్సహాయకవిత్వనిర్మాణచాతుర్య నిస్తంద్ర శ్రీరామనామపారాయణనారా
యణామాత్య ప్రణీతం బైన హంసవింశతి యనుమహాప్రబంధంబునందు సర్వంబును
బంచమాశ్వాసము.



'వావిళ్ల' ప్రెస్, తండయార్పేట, చెన్నపురి.—1925.